శారదాగ్రంథమాల

# అమరుకావ్యము

కృతిభర్త:

కవిభూషణ, కవిశేఖర

శిష్టా వేంకటసుబ్బయ్యగారు

పైలరున్నతపాఠశాలాంధ్రపండితుఁడు



కృతికర్త:

కవిశేఖర

గరికపాటి మల్లావధానిగారు

ఏలూరు పురపాలకోన్నతపాఠశాలాంధ్రపండితుఁడు

శ్రీ

# శారదా గ్రంథమాల

## మహారాజపోషకులు

(రూ. 116)



1. శ్రీరాజా వేంకటనరసింహాప్పరావు, సవాయిశ్వరావు బహదర్ వారు
శనివారపుపేట

2. ,, రావుసాహెబ్, ఎఱ్ఱమిల్లి నారాయణమూర్తిపంతులుగారు
బి. ఎ., బి. ఎల్., నరసాపురం

3. ,, మన్నె సత్యనారాయణమూర్తి జమీందారుగారు కొడమంచిలి

4. ,, తాయి సత్యనారాయణమూర్తిగారు ఎల్. ఎం. అండ్ ఎస్.
ల్యాండులార్డు, నరసాపురం

5. ,, చక్రావధానుల రాజాజీధ్వేజీగారు, వారి కుమాళ్ళు
లక్ష్మీనరసింహధ్వేజీగారు ల్యాండులార్డ్సు, నరసాపురం

6. ,, అందె ఆచార్యులుగారు ల్యాండులార్డు, శంబరదీవి

7. ,, మన్నె బుల్లితిరుపతిరాయుడుగారు ల్యాండులార్డు, దేవ

8. ,, ఎనమండ్ర సూర్యనారాయణగారు ల్యాండులార్డు, నరసాపురం

9. ,, ఉద్దగిరి కృష్ణారావుగారు ల్యాండులార్డు, వేములదీవి

10. ,, రాంపల్లి వీరరాఘవవిశ్వేశ్వరభాస్కరసోమయాజులుగారు అండ్
సత్యవెంకటరామసోమయాజులుగారు ల్యాండులార్డ్సు, నరసాపురం

11. ,, పీసపాటి లక్ష్మీనరసింహాచార్యులుగారు ల్యాండులార్డు, మచ్చపురి

# రాజపోషకులు

(రూ. 58)

1. శ్రీ రాజా కల్దిండి వెంకటలక్ష్మీనరసింహరాజబహదర్‌వారు మొగలతుర్రు
2. ,, పెన్మెత్స రంగరాజుగారు ల్యాండులార్డు ,,
3. ,, అల్లి కృష్ణమూర్తిగారు ల్యాండులార్డు నరసాపురం
4. ,, కె. ఎస్. నాగేశ్వరరావుగారు, ది బెంగుళూర్‌సిటీ డ్రెస్‌మార్టు రాజమండ్రి
5. ,, అత్తిలి వెంకట్రామయ్యగారు దేశబంధుపత్రికా సంపాదకులు నరసాపురం
6. ,, వంగూరి నరసింహారావుగారు కమలకుటీరము ,,
7. ,, పప్పుల మసేను అనే వెంకన్నగారు ,,
8. ,, ఎ. వామనరావుగారు మెడికల్‌స్టోర్సు ,,
9. ,, ఓసూరి నీలకంఠం జమీందారుగారు ,,
10. ,, వస్తాదు వెంకటస్వామిగారు నేటివుడాక్టరు ,,
11. ,, బుడ్డిగ వెంకన్నగారు ,,
12. ,, రాపాక సూర్యనారాయణమూర్తిగారు పాలకొల్లు
13. ,, ఆదోతుల రామన్నగారు ,,
14. ,, వల్లూరి నరసింహమూర్తిగారు కరణం వల్లూరు
15. ,, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రుస్తుంబాదా

# పోషకులు



| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ ఓసూరి వెంకటస్వామినాయుడుగారు | ల్యాండులార్డు, | నరసాపురం |
| 2. | ,, కడింపర్ల సుబ్బారాయుడుగారు | ,, | ,, |
| 3. | ,, అల్లూరి కృష్ణమరాజుగారు | ,, | ,, |
| 4. | ,, కొమాండూరి శేషాద్రిఅయ్యంగారు గారు | ,, | ,, |
| 5. | ,, పోతరాజు సుబ్బారావుగారు | సీతారామాప్రెస్ ప్రొప్రయిటరు | ,, |
| 6. | ,, ఎమ్. కోదండరామయ్యగారు | డాక్టరు | ,, |
| 7. | ,, పొన్నపల్లి సుబ్రహ్మణ్యంగారు | ,, | ,, |
| 8. | ,, నిధానమపూడి కుటుంబరావుగారు | ,, | ,, |
| 9. | ,, ఆచంట పెదగోపాలంగారు | ,, | పాలకొల్లు |
| 10. | ,, శిష్టా సుబ్రహ్మణ్యంగారు | ల్యాండులార్డు | మొగలతుర్రు |
| 11. | ,, పి. ఎల్. నరసింహారావుగారు | ,, | గెద్దనాపల్లి |
| 12. | ,, కల్దిండి వెంకటనరసింహరాజుగారు, | కోఆపరేటివ్ సూపరువైజర్ | పెనుగొండ |
| 13. | ,, నూకల సోమసుందరంగారు | వకీలు | నరసాపురం |
| 14. | ,, శిష్టా శ్రీరామమూర్తిగారు | ల్యాండులార్డు | ,, |
| 15. | ,, పోలిశెట్టి సుబ్బారావుగారు | ,, | పాలకొల్లు |
| 16. | ,, మేడూరి విశ్వనాథంగారు | జమీందారు (గొంది) | చేబ్రోలు |
| 17. | ,, గోటేటి రామకృష్ణారావుగారు | ల్యాండులార్డు | నరసాపురం |
| 18. | ,, జక్కం వెంకటసుబ్బారావుగారు | ,, | ,, |
| 19. | ,, గంటి లక్ష్మినరసింహశర్మగారు | బి. ఎ., బి. ఇ. డి.; | ,, |
| 20. | ,, వేలివెంటి పట్టాభిరామయ్యగారు | ల్యాండులార్డు | ముత్యాలపల్లి |
| 21. | ,, రేవు మీరాసాహేబుగారు | ,, | నరసాపురం |
| 22. | ,, కంభంమెట్టు గోవిందరావుగారు | ఎం. ఏ., బి. ఎల్.; | గుంటూరు |
| 23. | ,, విద్వాన్, గొట్టుముక్కల నరసింహరాజుగారు | తెలుగుపండితులు హైలరుస్కూలు బ్రాంచి, | నరసాపురం |
| 24. | ,, కనుమూరి వెంకటకృష్ణారావుగారు | ల్యాండులార్డు | ,, |



కృతిభర్త :

కవిభూషణ, కవిశేఖర

శ్రీ శిష్టా వేంకట సుబ్బయ్యగారు

శ్రీ

# అమరుకావ్యము

## కృతిసమర్పణము.

శ్రీ సారస్వతరూపిణీ భగవతీ చింతామణీదేవతా
యాహ్యార్ధాంగరమావిధేశ్రుతిభృతస్సా భారతీ జాయతా
మేతత్కావ్యవధూవరాయ కమలాకాంతాయ శాంతాత్మనే
శిష్టావేంకటసుబ్బయాఖ్యకవయేఽభీష్టప్రదా సర్వదా. 1

చ. చెలిమిఁ బురస్కరించుకొని చేసినవియ్యపుఁదియ్యమెన్నఁడుం
గలఁగకనాఁడునాఁటికి నఖండసుఖాస్పదమౌనటంచు నా
తొలికృతికన్య నిందునకుఁ దోరపుఁగూరిమిఁ బెంచి నీకర
మ్ముల నిడుచుంటి నీవెటులఁ బ్రోచెదో? వేంకటసుబ్బసత్కవీ! 2

చ. కలదు సపత్నియంచుఁ దనకన్నను మిన్న ఉదారసద్గుణా
ఢ్యలు కృతిపుత్రికల్ గలరటంచు నెఱింగియుఁ దావకీన ని
స్తులిత. రసజ్ఞతాగుణవిశుద్ధతయున్ మన కూర్మిపేర్మిలోఁ
దలఁచి తమిన్నినున్ వలచి తాఁగొనె మత్కృతికన్య నేలుమా! 3

ఉ. ఎందఱులేరు లోకమున నేమిఫలంబు ధనాఢ్యులయ్యు న
స్పందులు లోభదూషితు లసంస్కృతచిత్తులు సంస్తుతిప్రియుల్
ముచ్చులు, వారిపేరన సుఖాశ్రయపుష్టివశమ్ముఁ జూపి నీవనన్
గందువమాటలం జెలఁగుకబ్బపుఁజేడియ గారవింపుమా! 4

గీ. అమరుకృతిపుత్రికా! రసికావతంసుఁ
బతిఁగరంచుచు, నిన్నుఁ జేపట్టుకతన
నెలమి నాతవియిల్లు వేయిళ్ల మొదలు
గాఁగఁ, జిరతరసత్కీర్తిఁ గ్రాలుమమ్మ! 5

శ్రీ ర స్తు.

# అ మ రు కా వ్య ము.

## కృ తి ప తి వం శ వ ర్ణ న ము.

శ్రీ సముదారు లార్జవవిశిష్టులు ధన్యులు పావనాగమా
భ్యాసపరాయణుల్ సుకృతపాపవివేచనశీలు రన్వహో
పాసితదైవతోత్తములు భవ్యు లపారకృపావిభాసురుల్
గాసలనాటిభూసురులు గల్గుదు రాంధ్రధరాతలంబునన్. 1

ఉ. భాసురగానసంపదకు భవ్యకవిత్త్వకలావిభూతి కా
వాసమనంగనొప్పు బుధవర్యుఁడు లోకమనోజ్ఞకావ్యవి
న్యాసుఁడు శిష్టకృష్ణకవినాయకుఁడెందు జనించె నట్టియా
కాసలనాటిశాఖకగు గౌరవమింక వచింపనేటికిన్. 2

వ. మఱియు. 3

ఉ. కాంతకలాప్తి నాకుఁజెలికాఁడగుకొండలరాయునొద్ద శా
కుంతలమన్కృతింగొనినకోవిదభర్త, వదాన్యవంశభా
స్వంతుఁడు వీరరాఘవుఁడు పాటిలఁజేసినసూత్నసద్యశః
క్రాంతి వెలుంగుచున్న యలకాసలనాటికొల మ్మలంతియే. 4

వ. తత్కులోద్భవులైన మహామహులంగూర్చి యించుకముచ్చ
టించెద. 5

సీ. వేదవేదాంగసద్విద్యావసీవాటి
కాటసుల్ కాసలనాటివారు
ప్రతివాదివాదనోత్పాటనోద్భటకలా
పాటవుల్ కాసలనాటివారు

తపతోషితోర్వీశదత్తాగ్రహారోరు
హాటకుల్ కౌసలనాటివారు
ఘనధర్మవర్తనోద్ఘాట్యమానస్వీక
వాటకుల్ కౌసలనాటివారు
గీ. సతతనిర్వర్తితాశేషసవనకర్మ
కాండసంపుష్టసవభుక్ప్రకాండసత్క-
టాక్షఖండితఘోరభవాటవీప్ర
వాటికులు మేటికౌసలనాటివారు. 6

కం. ఆ కౌసలనాట్యవని ది
వౌకశ్శ్లాఘికను నంచితాచారయుతుల్
శ్రీ కౌండిన్యస గోత్రులు
ప్రాకటశిష్టాన్వయజులు గ్రాలుదు రెలమిన్. 7

శా. నష్టాశేషవిమోహులై విదళితాంతశ్శత్రులై యాగమా
దిష్టానేకమఖక్రియాంచితమహాదీక్షాఢ్యులై సర్వదా
శిష్టాచారపథప్రవర్తనవిధిం జెన్నారుటన్ ధారుణీ
శిష్టాచారసుఖ్యాతి యర్థయుతమై సిద్ధించె నవ్వారికిన్. 8

ఉ. ఆకరణింబ్రఖ్యాతజగదంచితవిశ్రుతి మించినట్టి శి
ష్టాకులులందునెల్ల మకుటాయితుఁడై జనియించె నుల్లస
త్ప్రాకటధీసమన్వితుఁడు వంశకరుండు గుణాకరుండు వి
వ్యాకుశలుండు భూరిసుకృతాఢ్యుఁడు వేంకనసూరి పేరిమిన్. 9

గీ. కోనసీమకుఁదగురాజధానియగుచుఁ
గొఱలునమలాపురమునకుఁగ్రోశమాత్ర
దూరముననొప్పుమీఱుపేరూరు దనకుఁ
గాపురముగా రహిల్లె వేంకనమనీషి. 10

ఉ. వేకువ లేచి కృత్యములవ్రేఁకముదీరిచి క్రుంకువెట్టి ని
ష్ఠాకలితాత్ముఁడై విధుల సక్రమత న్నెఱవేర్చి యాతిథే
యైకవిధానము న్నెఱపి యాదట శిష్యులతోడఁగూడి మే
లౌ కుడుపాఠగించెడు గృహస్థుఁడు వేంకనసూరి యెన్నఁగన్.

వ. ఏతాదృశానూచానసంపత్తిమహత్త్వంబునను నిసర్గసముపాత్త శమదమశాంత్యార్జవాదిగుణసమూహవిశేషంబునను సకలజనశ్లాఘ్యపదంబున మెలంగుచుఁ గొంతకాలంబునకుఁ దనసాధ్వీలలామంబునందు. 12

ఉ. అత్రివినిస్పృహాత్ముఁడతఁ డంతటఁగాంచె జగత్పవిత్రచా
రిత్రులఁబూతగాత్రుల వరిష్ఠకళాభ్యుపదేశతోషిత
చ్ఛాత్రుల వేదమిత్రులఁబ్రశస్తజపస్వవశీకృతైకసా
విత్రులఁగల్మషద్రుమలవిత్రులఁబుత్రులఁబుణ్యపాత్రులన్. 13

గీ. శుభచరిత్రుండు వేంకనసూరివరుఁడు
వడయఁగాంచినపుత్రక ద్వయమునందు
నగ్రజుఁడు నరసింహనామాంకితుండు
నవరజుండింక సుబ్బరాయాభిధుండు. 14

ఉ. వారలలో నృసింహుఁడను భవ్యుఁడు బాల్యమునందె భూరి వి
ద్యారమణీయుఁడధ్యయనదక్షుఁడునై నిగమాభ్యుదాహృతా
చారపరంపరాసరణిసంచరణప్రసరద్యశస్కుఁడై
చారుగుణప్రసంగతిని సన్నుతికెక్కె మహీసురావళిన్. 15

వ. ఈరీతి నిష్కళంకప్రవర్తనామహత్త్వంబున సముపలబ్ధంబైన యశోవిభూతికాలవాలంబై మఱియు. 16

మ. మహనీయాగమనిష్ఠుఁడై యుభయమీమాంసాదిషడ్దర్శన
ప్రహితాస్థాసముపంచితప్రతిభుఁడై ప్రారబ్ధసత్రక్రియా
మహితుండై బహుళాతిథిప్రముఖసంపత్పాత్రచారిత్రుఁడై
గృహమేధీశ్వరుఁడై నృసింహవిబుధాధీశుండు గ్రాలెంగడున్.

ఉ. ఈగతి నెల్లరీతుల సమృద్ధులతోఁ దులఁదూఁగుచు న్మహో
భాగులు ప్రాక్తనుల్ సనిన భవ్యపథంబున నేగు పావనో
ద్యోగము కల్మి నొప్పి, తనకున్న కొలంది నొసంగు సన్నుత
త్యాగము పేర్మి బిట్టుఁ బొలుపారె నృసింహమనీషి ధన్యుఁడై. 18

వ. ప్రశాంతవిధానంబున నీరీతి నాతఁడు కాలంబు గడువంబెట్టు
చుండ, నిజసతీమణియగు లక్ష్మీనరసమాంబాగర్భశుక్తిముక్తా
ఫలంబులై. 19

కం. జనియించి రంత నాత్మజు
లినసమవర్చస్వు లమలవృత్తివిశిష్టుల్
జనవినుతవర్తనాఢ్యులు
ఘనుఁడగు నరసింహనామకద్విజమణికిన్. 20

వ. మనోహరతేజంబులం బ్రభవించి సముపాత్తజాతకర్మాదివిహిత
కర్ములై యక్కుమారకులు. 21

కం. స్మయదూరు లిర్వురును గొం
డయ యనియును మఱియు సూర్యనారాయణ శా
స్త్రి యనియుఁ బేరుల వెలసిరి
నయవినయప్రముఖసద్గుణమ్ములు మెఱయన్. 22

ఉ. ప్రాయము పిన్నయయ్యుఁ దగుభంగిని విద్యల సంగ్రహించి యౌ
రా యని లోకమెన్నఁ బొలుపారెడు సిర్వ్వరలోన సూర్యనా
రాయణశాస్త్రి నైపుణియుఁ బ్రజ్ఞయు, సన్మతి, సాధువర్తన
శ్రీయును, బెంపుమీఱఁ దనరెం దలిదండ్రులు సంతసింపగన్.

వ. ఈదృశంబులగు మహనీయగుణంబులఁ బెంపారుచున్న యద్బా
లకుండు నరసాపురనివాసియు శిష్టాన్వయసముద్భవుండునైన
సుబ్బరాయసుధీంద్రుని సతీమతల్లికి, బాపనాంబావధూటికి
పుత్త్రుండై పదంపడి నరసాపురంబుఁ జేరంగాంచి, సముచిత
విద్యావినోదంబులఁ గాలంబు పుచ్చుచుండె. 24

గీ. వేడ్కమై మత్స్యపురిలోన వెలసియున్న
శ్రీ జనార్దనదేవుని సేవకొఱకు
భామినే కాక వాహనంబుల నొసంగె
మహితగుణపేటి బాపనాంబా వధూటి. 25

వ. ఇట్టి పవిత్రచరిత్రయైన జననిచే నతండు దిద్దంబడి. 26

క. అడఁకువయు, నేర్మి, యోర్మియుఁ
గడుభక్తియు, మిగులశ్రద్ధ, కరమును మేలౌ
నడవడియు మీఱఁ దన పెం
పుడుతల్లి కతండు మిగులమోదము గూర్చెన్. 27

వ. ఇవ్విధంబున జననీసేవాపరాయణుండై కొంతకాలంబుగడపి,
తనకెంకను విద్యాపిపాస దీరమింజేసి, యతండు. 28

ఉ. వాణికి ముద్దుబిడ్డలయి భాసిలు సత్కవులున్ ప్రవీణపా
రాణికులుం గణాదమునిరాజ, పతంజలి, గౌతమర్షి రా
ట్పాణిని శాస్త్రదక్షులును, ప్రాకటమంత్రవిదింద్రులున్న వా
రాణసిఁ జేరి సద్గురుపరంపరఁ గొల్చెను బెక్కు వర్షముల్. 29

ఉ. ఆయుపధారణన్, ప్రతిభ, నంచితకౌశలి, బుద్ధి, శ్రద్ధ, వి
స్వాయముదారవృత్తి, సహపాఠికులార్యముఁడౌచుఁ బాండితీ
శ్రీ యెసలార సద్గురుల శిక్షఁ గృతార్థతఁ గాంచి సూర్యనా
రాయణశాస్త్రి నాఁ జను నిజాఖ్య నతం డొనరించె సార్థమున్ 30

గీ. అతఁడు కేవలశాస్త్రపాండితినె కాక
మంత్రశాస్త్రమ్మునను గూడ మహితుఁ డగుచు
సానదీఱిన మణియట్లు సమధికప్ర
భా రమను మీఱి యింటికిఁ జేరుకొనియె. 31

వ. ఇవ్విధంబున ననన్యసామాన్యవిద్యావిభవవిభాసురుండై, నిజ
పురంబున జనములగ్గింప, ననూచానసంపత్తి పరిఢవిల్ల యథా
విధ్యనుసార్యమాణనిజకులోచితాచారుండగుచు, నరసమాంబా
నామధేయంబునం బరగు నొక్క సతీశిరోమణిం బరిణయవిధిం
బరిగ్రహించి, నిత్యనిర్వర్తితలోకోత్తరగృహమేధి ధర్ముండై.

సీ. ఆహ్నికమ్ములఁదీర్చి, యగ్నినారాధించి,
శాంతచిత్తుండౌచు, జపమొనర్చు,
స్వాధ్యాయనిరతుఁడై, వరపదక్రమజటా
ఘనల సుస్వరములు గలుగఁబలుకు,

నతిభక్తి దైవార నభ్యాగతులనెల్ల,
నర్ఘ్యపాద్యములిచ్చి యాదరించు,
వాత్సల్య మొప్పంగ స్వచ్ఛాత్రవితతికిఁ
గ్రమమొప్ప శాస్త్రపాఠములు సెప్పు,

గీ. పరధనేచ్ఛాదికప్రాజ్ఞవారనింద్య
కృత్యములవంక మనసుఁ బోనీక యమల
వృత్తి దీపింపఁ బెంపారె ద్విజకులాగ్ర
సరుఁడు, సూర్యనారాయణశాస్త్రి విభుఁడు. 33

వ. మఱియు, నమ్మహనీయునిష్ఠాగరిష్ఠుండు. 34

గీ. మంత్రశాస్త్రంబునం గల్గు మర్మములను
జక్కఁ బరిశీలనము సేసి, శ్రద్ధమెయి ను
పాసనలు సల్పి, కృతకృత్యతాసమృద్ధి,
ససమమాంత్రికుఁ డన్న సద్యశము వడసె. 35

వ. ఇట్లు సకలజనశ్లాఘ్యపవిత్రచారిత్రంబున మెలంగుచుండ, నక్కా-లంబున నరసాపురంబున శ్రీరాజా కందుకూరి శివప్రసాదభూష ణరావు బహదర్, జమిందారు, చండికాయాగంబుఁ గావింప సమ కట్టి, యర్హుండైన యధ్వర్యుంగానక పరితపించుచు, లోకవిశ్రు తింజేసి విని, యేతత్సంఖ్యావత్కులేంద్రు సందర్శించి, చండికా యాగావభృథప్రాప్తిం దమ్ముఁ బునీతులం గావింపుడని వేఁడి కొలుసలుప. 36

కం. అర్యమసమతేజుం డతఁ
డార్యులు మెచ్చంగఁ జండికాధ్వరమున స
ద్ధైర్యుండై సముచితముగఁ
గార్యక్రమమెల్ల నడపి ఖ్యాతి గడించెన్. 37

వ. ఇట్లనంతకీర్తిరమావిలాసభాసురుండై వెలుంగు సన్నైష్ఠిక
శిఖామణికిఁ గొంతకాలంబు సన్నుత సజ్జనశిరోమణియైన సరస
మాంబావధూటివలన. 38

కం. కలిగిరి, దారకు లిరువురు
కలితకళామయులు, వంశకర్తలు, గుణయు
క్తులు, బుధమిత్రులు, సుకుమా
హాలు, లోకకన్యాద్వయమున కవరజు లగుచున్. 39

ఆ. వె. వెలయు నగ్రజుండు వేంకటసుబ్బయ్య
యనెడుపేర సద్గుణాబ్ధి యగుచు,
సుమతి, యవరజుండు సూర్యనారాయణ
మూర్తి యనెడు నామమున రహిల్లు. 40

ఆ. వె. సుతులు పుట్టువెనుక నింతకాలమునకే
వింతగాఁగఁ దాను వెలఁదిఁ గూడి
శుభగుణాకరుండు సూర్యనారాయణ
శాస్త్రి సేరుకొనియె స్వర్గమునకు. 41

కం. జననియు జనకుఁడు నొకచే
దినమున దేహములు వీడి దివికేగుటఁ దో
డన యబ్బాలకులను గై
కొని తద్భావుకుఁడు పెంచెఁ గూర్మి దలిర్పన్. 42

వ. ఇట్లు నిజభావుకుండును, మహోన్నతవంశసంభవుండును, నను
కంపామహితుండును నైన సత్యనారాయణాహ్వయు సుబుద్ధిచేఁ
బ్రవర్ధితులై, సమాకలితసముచిత విద్యాబుద్ధులై మెలంగు
తత్సోదరద్వయంబునం దగ్రజుండయిన, వేంకట సుబ్బ
య్యాఖ్యుండు. 43

ఉ. భ్రాతృజనాభివత్సలుఁడు బంధుజనాశ్రయుఁ డంచితక్షమా
న్వితుఁడు సత్కళాప్రియుఁడు నిర్మలమానసుఁ డుల్లసద్దయా
న్వితుఁ డుదారవర్తనుఁడు శిష్టజనాప్తుఁడు సత్కవీశ్వర
వ్రాతసఖుండునుం గవియు భవ్యయశస్వియు నయ్యెఁబేరిమిన్.

గీ. మహితచారిత్రకుం డభిమానధనుఁడు
ధర్మకర్మాభినిరతుండు నిర్మలుండు
నిత్యవిద్యావ్యసనబుద్ధి నెగడు మేటి
శుభచరిత్రుండు వేంకటసుబ్బ సుకవి. 45

వ. ఇవ్విధంబునఁ బ్రశస్తచరిత్రుండును. బ్రశాంతమనస్కుండును నై,
పూర్వార్జితంబైన క్షేత్రధనసమృద్ధి నేవెంటకుం గొఱంతలేక
సుఖజీవనంబు నడుపుచున్నంత, లేఁబ్రాయంబునందె. 46

శా. చేపట్టెం గమలావధూటిని, గుణశ్రీపేటినిం, బావన
వ్యాపారోన్మిషదాత్మవాటిని, మహాప్రఖ్యాతసద్వర్తనా
దీపత్పొట్లలఘాయితాంతరవిరోధిశ్రేణికాధాటినిం
బాపక్ష్మాధరపాటనక్షమసతీత్వప్రౌఢినీకోటినిన్. 47

వ. ఇట్లాతండు సేపట్టం గాంచిన, కమలాంబాలలామంబు. 48

ఉ. స్థాయము జాంకొ౯ లవిభాసురవ ర్తనుఁడై న, యయ్యుపా
ధ్యాయుల విశ్వనాథబుధనాగ్రణి సద్భహమై, జనప్రహా
గేయగుణప్రశాంతమునఁ గీర్తికిఁ దావయి, భర్త కిష్టసం
ధాయినియై, సుశీలయును, ధర్మపరాకృతియై విరాజిలున్. 49

వ. ఇట్టి సాధ్వీశిరోమణి సంసర్గంబునం జేసి, పుణ్యుండును, భాగ్య
శాలియు నైన, శ్రీవేంకటసుబ్బయాఖ్యుండు. 50

మ. హవుసా తిర్మలదేవి నాఁబరగు నవ్యగ్రంథ మేకాక వా
సవద త్తా హృదయాభిరామముఖ భాస్వద్సత్కృతుల్ వ్రాసి నీ
టవు మాటాడ శివాలయంబు దరియం దజ్ఞాకరం బొందుఁ దే
వ్కై వినిర్మించి కరమ్ముఁ బెంపెసఁగుఁ గీర్తి శ్రీల కావాసమై. 51

వ. మఱియు. 52

గీ. సరవి పైలరున్నతపాఠశాల యందు
నాంధ్రపండితపదవిఁ దా నధిగమించి
యధిపతుల మన్ననలఁ బాత్రమై మెలంగు
సుగుణములదీవి వేంకటసుబ్బ సుకవి. 53

## ష ష్ఠ్యం త ము లు.

కం. ఏతాదృశగుణయుతునకు,
వీతాంహస్సంచయునకు, విబుధవిధేయ
స్ఫీతాత్మునకు, భూరివి
నీతచరిత్రునకు, ధారుణీవిబుధునకున్. 54

కం. భవ్య విపశ్చిద్వర్గల గో
ష్ఠీవ్యాపారానుషక్తచిత్తునకు, మహా
కావ్యరచనాచణునకు,
నవ్యకలారత్నభూషణస్నిగ్ధునకున్. 55

కం. వితతయశోభిరతికి, సం
తతవిద్యానిరతమతికిఁ దర్పితకవిరా
డ్వ్రతతికి, సుకృతార్జిత స
ద్గతికిఁ, గృతద్విజవినతికిఁ, గమలాపతికిన్. 56

కం. ప్రకటామల శీలాస్పదు
నకు, సుగుణాఢ్యునకు, సూర్యనారాయణ శా
స్త్రి కుమారాగ్రేసరునకు,
స్వకులాభరణునకు, సరసవాక్పటునకున్. 57

కం. నయభూషణునకు, వితరణ
దయానిలయునకు, శమైకధనునకు, శిష్టా
న్వయవిధునకు, వేంకట సు
బ్బయనామ కవీశ్వరునకు, నకలంకునకున్. 58

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా సమర్పితంబగు మదాంధ్రీకృతా
మరుకావ్యంబున కుపక్రమప్రక్రమం బెట్టిదనిన:- 59

శ్రీః

# అ మ రు క మ్

శ్లో. జ్యాకృష్టిబద్ధకటకాముఖపాణిపృష్ఠ
ప్రేఙ్ఖన్నఖాంశు చయసంవళితో మృడాన్యాః
త్వాం పాతు మఞ్జరితపల్లవకర్ణ పూర
లోభభ్రమద్భ్రమరవిభ్రమభృత్కటాక్షః. ౧

చ. కరమున నారి లాగి కటకాముఖమున్ ఘటియింప వెన్కకున్
దొరలు నఖాంశుజాలములతోఁ జెరలాడుచుఁ గర్ణపూరమం
జరితనవీనపల్లవవిసారవిలోలచరత్భ్రమత్తబం
భర మనసొప్పు శాంకరియపాంగము నిన్ గృపనోముఁగావుతన్.

శ్లో. క్షిప్తోహస్తావలగ్నః ప్రసభమభిహతోఽప్యాదదానోఽంశుకాన్తం
గృహ్ణన్కేశేష్వపాస్తశ్చరణనిపతితో నేక్షిత స్సంభ్రమేణ
ఆలిఙ్గన్యోఽవధూతస్త్రిపురయువతిభిస్సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధ స్సదహతు దురితం శామ్భవో వశ్శరాగ్నిః.

సీ. కరముల నంట సంగర మూని విదలించి
చేలాంచలము ముట్టఁ జిందఁగొట్టి,
తగు నదనెంచి యొదలను మూర్కొనఁ బోవఁ
దొట్టుపాటెసఁగంగఁ దొలఁగఁ ద్రోలి,
ఆవేగ మొప్పఁగా నాలింగన మొనర్పఁ
దోడ్తోడ నవలకుఁ ద్రోసిపుచ్చి,
గతి తప్పి చరణయుగ్మంబుపై వ్రాలంగఁ
జెదురింతలేక వీక్షింపకుండి,

గీ. త్రిపురచంద్రాస్య లశ్రుపూరితకటాక్ష
లగుచు నిరసించుచుండ, సార్ద్రాపరాధుఁ
డైన కాముకునిం బోలు హరశరాగ్ని
తావకీనాఘరాశి దగ్ధంబుసేయు. 2

శ్లో. ఆలోలా మలకావళిం విలుళితాం బిభ్ర చ్చలత్కుణ్డలం
కిఞ్చిన్మృష్టవిశేషకం తనుతరైః స్వేదామ్భసాం జాలకైః
తన్వ్యా యత్సురతాన్తతాన్తనయనం వక్త్రం రతివ్యత్యయే
తత్త్వాం పాతు చిరాయ కిం హరిహరబ్రహ్మాదిభిర్దైవతైః. ౩

చ. అలకలు కీర్ణమై మలసియాడఁగఁ, గర్ణములందు రత్నకుం
డలయుగమూఁగ లేఁజెమటలం దిలకంబు సెమర్పఁ గన్ను ల
త్యలసతనొప్పఁగా సువరతాంతమునం దెలనాగమోము ని
న్నలరుచు నింక, నా హరిహరాజముఖామరకోటి యేటికిన్. 3

శ్లో. సందష్టాధరపల్లవా సచకితం హస్తాగ్ర మాధున్వతి
మామా ముఞ్చ శఠేతి కోపవచనై రానర్తితభ్రూలతా
సీత్కారాఞ్చితలోచనా సపులకం యైశ్చుమ్బితా మానినీ
ప్రాప్తం తైరమృతం శ్రమాయ మథితోమూఢైస్సురైస్సాగరః.

అవతారిక :—కవి, తన కావ్యమునఁ బ్రతిపాదింపఁబడు కామపురు
షార్థమునకు ఫలమును జూపుచున్నాఁడు.

చ. అదటున మోవి నొక్కినఁ గరాగ్రము నూచుచు వద్దు మానరా
యదయుఁడయంచదల్చిబొమలార్చుచుసీత్కృతిఁగన్నుమోడ్చు న
మ్మదితను గగ్గురుల్ పొదల ముద్దిడు నాతఁడె క్రోలెఁబో సుధన్
మది మదినుండ కా సురలు మందులు సంద్రమునేలత్రచ్చిరో. 4

శ్లో. అలసవళితైః ప్రేమార్ద్రార్ద్రై ర్ముహు ర్ముకుళీకృతైః
క్షణమభిముఖై ర్లజ్జాలోలై ర్నిమేషపరాఙ్ముఖైః
హృదయనిహితం భావాకూతం వమద్భి రి వేక్షణైః
కథయ సుకృతీ కోఽయం ముగ్ధే త్వ యాద్య విలోక్యతే. ౫

అవ :—చెలికత్తె నాయిక నడుగుచున్నది.

చ. అలసములుం, ప్రవాంచితము, లావళితంబులు, ప్రేమపూర సం
కలితములున్, క్షణంబభిముఖంబులు, సంకుచితంబు, లెంతయున్
గలితనిమేషముల్ గడిచిగర్భితభావములైన చూపులం
జిలుకుచు, ముద్దరాల! కృతిఁ జేసితివే! సుకృతి న్వచింపుమా! 5

శ్లో. అఙ్గుళ్యగ్రనఖేన బాష్పసలిలం విక్షిప్య విక్షిప్య కిం
తూష్ణీం రోదిషి కోపనే బహుతరం ఫూత్కృత్య రోదిష్యసి
యస్యాస్తే పిశునోపదేశవచనై ర్మానేఽతిభూమిం గతే
నిర్విణ్ణోఽనునయం ప్రతి ప్రియతమో మధ్యస్థతా మేష్యతి. ౬

అవ :—నాయకునిచే లోఁబఱుచుకొనఁబడిన చెలికత్తె, నాయికతోఁ
జెప్పుచున్నది.

ఉ. కోపన! బాష్పబిందువులు గోటను మీటుచు నూరకిట్లు సం
తాపము నొందెదేల? పిశునంబుల హెచ్చిన నీదు కోపముం
బాపఁగ నోపమిన్ విసుగుపాటున నీప్రియుఁ డూరకున్నచో
నాపయి శోకమే శరణమౌ నని నెమ్మదిలోఁ దలంపుమా! 6

శ్లో. దత్తోఽస్యాః ప్రణయ స్త్వయైవ భవతా సేయం చిరం లాలితా
దైవ్యాదద్యకిల త్వమేవ కృతవా నస్యా నవం విప్రియమ్
మన్యుర్దుస్సహ ఏష యాత్యుపశమం నోసాన్త్వవాదైః స్ఫుటం
హే నిస్త్రింశ విముక్తకణ్ఠకరుణం తావత్సఖీ రోదితు. ౭

అవ :—నాయకపక్ష మవలంబించిన సఖి నాయికసమక్షమున నాయ
కునితోఁ జెప్పుచున్నది.

చ. కడు చనవిచ్చి మాచెలికి గౌరవ మెంతయు నీవె పెంచి యి
య్యెడఁ దొలితప్పు దైవగతి నించుక చేసితిగాదె? దానిచే
నడరిన కోప మీ యనునయంబుల మానునె! క్రూరచిత్త! వా
విడిచి యథేచ్ఛమై నొకట వెక్కుచువెక్కుచు నేడ్చునంతకున్.

శ్లో. లిఖన్నాస్తే భూమిం బహిరవనతః ప్రాణదయితో
నిరాహారాస్సఖ్య స్సతతరుదితోచ్ఛూననయనా
పరిత్యక్తం సర్వం హసితపఠితం పఞ్జరశుకై
స్తవావస్థాచేయం విసృజకఠినే మాన మధునా. ౭

అవ :—సఖి, నాయిక నుపాలంభన మొనరించుచున్నది.

చ. వెలుపల నీ ప్రియుండు తలవ్రేల్చుక భూమిని వ్రాయుచుండె, నె
చ్చెలులును బోనముల్ విడిచి చింతిలుచుండిరి కన్నులుబ్బఁగాఁ
జిలుకలు నవ్వుమాటలు త్యజించి తపించుచునుండె గూళ్ల నీ
యలమట యిట్టులుండెఁ గఠినాత్మిక! మానము నింక మానవే. 8

శ్లో. నార్యోముగ్ధశఠాహరన్తి రమణం తిష్ఠన్తి నో వారితా
స్తత్కిం తామ్యసి కిం చ రోదిషి పునస్తాసాం ప్రియంమాకృథాః
కాన్తః కేళిరుచి ర్యువా సహృదయ స్తాదృక్ప్రియః కాతరే
కింనో బర్బర కర్కశైః ప్రియశతై రాక్రమ్య విక్రీయతే. ౯

అవ :—నాయకునిచే లోఁబఱుచుకొనఁబడిన సఖి నాయిక నుపాలం
భన మొనరించుచున్నది.

చ. గరితలు నాలి(ముచ్చులయి కాంతుని లో(గొనుచుం(డి మూన రే
కరణిని వారికే (ప్రియముగా(గ( డపించెదవేల బేలవై
తరుణి! (ప్రియుండుజాణ, రతితత్త్వవు(డుఁ యువకుండువానిలో(
బరుసము లాడనేల? (ప్రియభాషల నా(చికొనంగ( బోలదే? 9

శ్లో. కోపాత్కోమలలోల బాహులతికాపాశేన బద్ధ్వాదృఢం
నీత్వా మోహనమందిరం దయితయాస్వైరం సఖీనాం పురః
భూయోఽప్యేవ మితి స్ఖలన్మృదుగిరా సంసూచ్య దుశ్చేష్టితం
ధన్యోహన్యత ఏవ నిహ్నుతిపరః (ప్రేయాన్ రుదత్యా హసన్.

అవ :—అపరాధి యగు నాయకుని నాయిక బెదరించుచున్నదని కవి
చెప్పిన మాట.

ఉ. కోమలబాహుపాశముల( గోపమునఁ బిగియించి కేళికా
ధామము( జేర్చి నెచ్చెలుల దండ యథేచ్ఛగ నౌర యిట్టులే
నా మఱియంచు గద్గదిక నాతని దుష్కృతి తోప నేడ్చుచుం
గామిని కొట్ట( దప్పిదము గప్ప హసించు నతండు ధన్యు(డౌ.

శ్లో. 'యాతాఃకిం నమిళన్తిసుద్దరి పునశ్చిన్తాత్వయా మత్కృతే
నోకార్యా నితరాం కృశాసి కథయత్యేవం సబాష్పేమయి
లజ్జామన్థరతారకేణ నిపతత్పీతాశ్రుణా చక్షుషా
దృష్ట్వామాం హసితేన భావిమరణోత్సాహస్తయా సూచితః.

అవ :—నాయకు(డు నాయికతో నన్నమాట.

ఉ. కోమలి! వె౦డియుం గలసికోరదె యూరికి( బోవువారు నా
కై మది( జింత మాను కృశతా_ర్తవటంచును వెచ్చనూర్చు చే
నేమొ వచింప, సిగ్గున నొకించుక న(శుల నాపి చూచుచుఁ
దా మరణింతునంచు విదితం బొనరించె లతాంగి నవ్వుచేన్. 11

శ్లో. తద్వక్త్రాభిముఖం ముఖం వినమితం దృష్టిః కృతా పాదయోః
తత్సల్లాపకుతూహలాకులతరే శ్రోత్రే నిరుద్ధే మయా
పాణిభ్యాంచ తిరస్కృతః సపులకః స్వేదోద్గమో గణ్డయోః
సఖ్యః కింకరవాణి యాన్తి శతధా మత్కఞ్చుకే సంధయః. ౧౨

అవ :—ప్రియునిపై మానముం బూనుమని బోధించిన సఖుల కట్లు చేయశక్తురాలు గాక, నాయిక బదులు చెప్పుట.

ఉ. ప్రక్కకు మోము ద్రాల్చితిని, పాదయుగంబును జూచుచుంటి ద
ద్వాక్కుల కోర కాచెవుల దాచితి గగ్గురుపిండుతోడ నుఁ
జెక్కులఁ గ్రమ్ము చెమ్మటను జేతులఁ గప్పితి నిన్ని చేసినన్
దక్కక కంచుకంబు శతధా పిగిలెఁ, జెలి! యేమిసేయుదున్.

శ్లో. ప్రహరవిరతౌ మధ్యే వాహ్న స్తతోఽపి పరేఽథవా
కిముత సకలే యాతేవాహ్ని ప్రియ త్వమిహైష్యసి
ఇతిదినశతప్రాప్యం దేశంప్రియస్య యియాసతో
హరతి గమనం బాలా వాక్యైస్సబాష్పగళజ్జలైః. ౧౩

అవ :—నాయకుఁడు సంకల్పించుకొన్న దూరప్రయాణమును నాయిక ముగ్ధభాషణములచే మాన్పుచున్నది.

ఉ. యామము దాటునంతకొ, దినార్ధమునందొ, యొకింతకో, ప్రభా
ధాముఁడు గ్రుంకునంతకొ, యథాగతి నీవిటు వత్తువంచుఁ దా
భామిని బాష్పగద్గదికభాషల మానుపఁజాలె జీవిత
స్వామి నయారె! నూరుదివసంబులు పట్టు విదేశయానమున్.13

శ్లో. కథమపిసఖి క్రీడాకోపాద్వ్రజేతి మయోదితే
కఠినహృదయ స్త్యక్త్వా శయ్యాం బలాద్గత ఏవ సః
ఇతి సరభసధ్వస్త ప్రేమ్ణి వ్యపేతఘృణే స్పృహాం
పునరపి హతవ్రీడం చేతః కరోతి కరోమి కిమ్. ౧౪

అవ:—నాయిక సఖితోఁ జెప్పుకొనుట.

చ. చెలి! బాలయల్కఁ బొమ్మని వచించితి నెట్టులో, యంతమాత్రనా
ఖలహృదయుండు ప్రక్క విడి గ్రక్కునఁ బోయె మరల్పరాక యి
ట్టుల నొకమాత్ర వీతదయుఁడున్ గతరాగుఁడు నైన వానికై
మలుకని నామనం బెదురుసూచెడు నింకను నేమిసేయుదున్.

శ్లో. దమ్పత్యోర్నిశి జల్పతో ర్గృహశుకే నాకర్ణితం యద్వచ
స్తత్ప్రాతర్గురుసన్నిధౌ నిగదత స్తస్యాతిమాత్రం వధూః
కర్ణాలమ్బిత పద్మరాగశకలం విన్యస్య చఞ్చూపుటే
వ్రీడార్తా విదధాతి దాడిమఫలవ్యాజేన వాగ్బన్ధనమ్. ౧౫

అవ:—కవివాక్యము.

ఉ. రాతిరి దంపతుల్ తమి సరాగము లాడఁగ విన్న చిల్క ప్రా
భాతమునం బొరిం గురులపజ్జ వచింపఁ దొడంగ లజ్జమై
భీతిలి నాతి దాడిమపుబీజమునాన్ జెవికెంపు దాని చం
చూతలమందుఁ జేరిచి వచోవినిరోధమొనర్చె నేర్పునన్. 15

శ్లో. అజ్ఞానేన పరాఙ్ముఖీం పరిభవా దాశ్లిష్య మాం దుఃఖితాం
కిం లబ్ధం శఠ దుర్నయేన నయతా సౌభాగ్య మేతాం దశామ్
పశ్యైత ద్దయితా కుచవ్యతికరా సక్తాఙ్గరాగారుణం
వక్షస్తేమమ తైలపఙ్కమలినై ర్వేణీపదై రఙ్కితమ్. ౧౬

అవ :—తన యపరాధమును గప్పిపుచ్చు నాయకుని, నాయిక నిందించుట.

చ. పరిభవదుఃఖదుఃఖిత నివర్తితవక్త్రను, నన్ను, నీదు సొం
పఱ నిటు కౌఁగిలించిన సుఖాప్తి యదేమొ; ప్రియాకుచోపరి
స్ఫురితనవాంగరాగపరిశోభితమౌ భవదీయవక్ష మే
కరణిని మజ్జటామలినకశ్మలమయ్యెనొ కంటివే శఠా! 16

శ్లో. ఏకత్రాసనసంగతిః పరిహృతా ప్రత్యుద్గమా ద్దూరత
స్తామ్బూలానయనచ్ఛలేనరభసాశ్లేషోఽపి సంవిఘ్నితః
ఆలాపోఽపి నమిశ్రితః పరిజనం వ్యాపారయన్త్యాన్తికే
కాన్తం ప్రత్యుపచారతశ్చతురయా కోపః కృతార్థీకృతః ౧౭

అవ :—అపరాధిని నాయకుని నాయిక తన నేర్పుచే ఖేదపెట్టుచున్నది.

మ. ఎదురై పోయి బహూకరించు మిషచే నేకాసనప్రాప్తి, తె
చ్చెదఁ దాంబూల మటంచు నేగి రభసాశ్లేషంబు దాసీక్రియా
ప్రదవృత్తిన్ బ్రతిభాషణంబు తొలఁగింపంజేసి స్వక్రోధమున్
మదిరాక్షీమణి తీర్చుకోఁగలిగె సమ్మానక్రియావైఖరిన్. 17

శ్లో. దృష్ట్వైకాసనసంగతే ప్రియతమే పశ్చాదుపేత్యాదరా
దేకస్యానయనే పిధాయ విహితక్రీడాను బన్ధచ్ఛలః
తిర్యగ్వక్రితకన్ధర స్సపులకప్రేమోల్లసన్మానసా
మన్తర్హాస లసత్కపోలఫలకాం ధూర్తోఽపరాం చుమ్బతి. ౧౮

అవ :—ఇద్దఱుకాంతల మగని చెయిదము—కవివాక్యము.

చ. కనుఁగొని యొక్కపీఠమునఁ గామిను లిర్వురు గూడియుంట వె
న్కను దరిఁజేరి యొక్కసతికన్నవ నాటకుఁబోలెఁగప్పి యా
ననము మరల్చి ధూర్తుఁడు ఘనప్రణయోత్సుకవృత్తి మీరఁ జుం
బనమొనరించె వేఱొకతె మంజులహాసలసత్కపోలమున్. 18

శ్లో. చరణపతన ప్రత్యాఖ్యానా త్ప్రసాదపరాఙ్ముఖే
నిభృతకితవాచారే త్యుక్త్వా రుషా పరుషీకృతే
వ్రజతి రమణే నిశ్వ స్యోచ్చైః స్తనాహితహస్తయా
నయనసలిలక్లిన్నా దృష్టి స్సఖీషు నిపాతితా. ౧౯

అవ :—సఖులబోధనలచేత నాయకునిపై నలుక దాల్చి, పశ్చాత్తా
పము పొందిన నాయిక దీనదశను కవివర్ణించుచున్నాఁడు.

చ. చరణపతత్ప్రియుని గలుషసంభృతవక్త్రమునఁ దంచు దూఱిఁ జె
చ్చెఱ నతఁడుం బ్రకోపపరుషీకృతుఁడై యటనుండి పోవ న
త్తరుణి కరం బురోజనిహితం బొనరించుచు నెచ్చనూర్చుచుం,
బరపె సఖీజనంబుపయి బాష్పవిమిశ్రితదీనదృష్టులన్. 19

శ్లో. కౌఞ్చ్యాగాఢతరావబద్ధవసనప్రాన్తా కిమర్థం పున
ర్ముగ్ధాక్షీ స్వపితీతి తత్పరిజనం స్వైరం ప్రియే పృచ్ఛతి
మాతస్సుప్తి మపీహ లుమ్పతి మమే త్యారోపితక్రోధయా
పర్యస్య స్వపనచ్ఛలేన శయనే దత్తోవకాశ స్తయా. ౨౦

అవ :—సఖులచే ప్రణయకలహముఁ బూనుమని బోధింపఁబడిన
నాయిక వారిమాట మీరుటకు జంకి కృత్రిమకోపము ప్రక
టించుట.

శా. చేలాగ్రంబు బిగించి యామె నిదురన్ సేవించెనేమే? యటం
చాళి న్నాథుఁడు మీఱి ప్రశ్నములు సేయన్ లేనికోపంబుతో
నేలా గమ్మరొ! యిప్పుడు న్నిదురఁబోనీఁ డంచు నొత్తిల్లి, య
వ్వాలారత్నము చోటొసంగె స్వపనవ్యాజంబుతోఁ బాన్పునన్. 20

శ్లో. ఏకస్మి న్శయనే పరాఙ్ముఖతయా వీతోత్తరం తామ్యతో
రన్యోన్యస్య హృది స్థితేఽప్యనునయే సంరక్షతో ర్గౌరవం
దంపత్యోశ్శనకై రపాఙ్గవలనా న్మిశ్రీభవచ్చక్షుషో
ర్భగ్నో మానకలి స్సహాసరభస వ్యావృత్త కణ్ఠగ్రహమ్. ౨౧

అవ :—కవివాక్యము.

శా. మానంబేచి సతీపతుల్ పడకపై మార్మోములంబెట్టి, లో
లోనం గుందుచునుండియున్, ఘనత కేలోపంబు రానీకయే
మౌనం బూన నపాంగపాతమొకటన్ బ్రాపించి, మానం బఱన్
లేనవ్వ ల్వొలయించి కౌఁగిళులఁ దేల్చె న్వారిఁదోరంబుగన్. 21

శ్లో. పశ్యామో మయికిం ప్రపద్యత ఇతిస్థైర్యం మయాఽలమ్బితం
కింమాం నాలపతీ త్యయంఖలు శఠః కోపస్తయాఽప్యాశ్రితః
ఇత్యన్యోన్య విలక్షదృష్టిచతురే తస్మిన్నవస్థాన్తరే
సవ్యాజం హసితం మయాధృతిహరోముక్తస్తు బాష్పస్తయా.

అవ :—నాయకుఁడు ముగ్ధాచేష్టితమును వచించుట.

ఉ. ఏమొనరించునో సుదతి యిప్పుడు చూచెదఁగాక యంచు నే
నేమియుఁ బల్కకున్నఁ దరశేక్షణ నన్నెద దూఱీ యాసుమై
సామము మానె నట్టి విరసస్థితి నే నెపమూని నవ్వినన్
గామినియున్ ధృతిం దలఁగి కన్నుల నశ్రుల రాల్చె నత్తఱిన్.

శ్లో. ఏకస్మిన్ శయనే విపక్షరమణీనామగ్రహే ముగ్ధయా
సద్యః కోపపరాఙ్ముఖగ్లపితయా చాటూని కుర్వన్నపి
ఆవేగాదవధీరితః ప్రియతమ స్తూష్ణీం స్థిత స్తత్క్షణం
మాభూత్సుప్త ఇవేత్యమన్దవళితగ్రీవం పునర్వీక్షితః. ౨౩

అవ :—మధ్యానాయికాచేష్టితమును గూర్చి కవివాక్యము.

గీ. సరసఁ బవళించి పతి తన్ను సవతిపేరఁ
బిలువఁ గోపించి పెడమోముఁబెట్టి ప్రియము
లెన్నిటం దీరమిని నూరకున్న నతఁడు
కనుకుననుభీతి, మెడఁద్రిప్పి కనె లతాంగి. 23

శ్లో. తస్యాస్సాన్ద్రవిలేపన స్తనతట ప్రశ్లేషముద్రాఙ్కితం
కిం వక్షశ్చరణానతి వ్యతికరవ్యాజేన గోపాయ్యతే ?
ఇత్యుక్తే క్వత దిత్యుదీర్య సహసా తత్సంప్రమార్ష్టుం మయా
సాశ్లిష్టా రభసేన తత్సుఖవశా త్తన్వ్యాచ తద్విస్మృతమ్. ౨౪

అవ :—అపరాధమునకై యలిగిన నాయికను నేర్పుమెయి, వెం డియు మోహింపజేసిన నాయకునివాక్యము. నాయిక స్వీయ మధ్య.

ఉ. పాదములందు వ్రాలెడు నెపంబున దాపఁగఁ జూచెదేల య
పైఁ బదలి కౌఁగిటన్ గుఱుతువారిన రొమ్మని కల్కిపల్కి నే
నేదది యేడఁ జూపుమని యేమఱుపం దలఁపూని యక్కునం
దాదుకొనంగ నేమఱిలె నామెయుఁ దత్సుఖసారమగ్నయై. 24

శ్లో. త్వంముగ్ధాక్షి వినైవ కఞ్చుళికయా ధత్సే మనోహారిణీం
లక్ష్మీ మిత్యభిధాయిని ప్రియతమే తద్వీటికాసంస్పృశి
శయ్యోపాన్త నివిష్టసస్మితవధూ నేత్రోత్సవానన్దితో
నిర్యాతశ్శనకై రళీకవచనో పన్యాసమాళీ జనః. ౨౪

అవ:—కవివాక్యము.

ఉ. రైకఁ దొరంగియే మిగుల రాజిలుచుందువటంచుఁ బల్కుచున్
వీక మనోహరుండు ముడి విప్పఁగడంగిన సెజ్జచెంత నిం
పౌ కడగంట నవ్వులొలయం దమి నాపె కరంప నెవ్వియో
సాకులు సెప్పి యొక్కొ_కరె జారిరి నెచ్చెలు లెల్ల మెల్లగన్. 25

శ్లో. భ్రూభఙ్గే రచితేఽపి దృష్టి రధికం సోత్కణ్ఠముద్వీక్షతే
రుద్ధాయా మపి వాచి సస్మిత మిదం దగ్ధాననం జాయతే
కార్కశ్యంగమితేఽపి చేతసి తనూరోమాఞ్చ మాలమ్బతే
దృష్టే నిర్వహణం భవిష్యతి కథం మానస్య తస్మిన్ జనే. ౨౬

అవ:—సఖుల బోధనప్రకారము భర్తపై నలుక వహింపనేరనిదై
వారితో నాయిక బదులుపలుకుట. నాయిక స్వీయ. ముగ్ధ.

గీ. బొమలు ముడిచితి దృష్టి పెన్మమతఁ జూచు
పలుకు లుడిపితి నవ్వు నీ పాడుమోము
గుండె ఱాఁజేసికొంటి గగ్గురులు వొడము
అతఁడు డాసినఁ గోప మెట్లాపఁగలనొ ? 26

శ్లో. ప్రాణేశప్రణయాపరాధసమయే సఖ్యోపదేశం వినా
నోజానాతి సవిభ్రమాఙ్గవలనావక్రోక్తి సంసూచనమ్
స్వచ్ఛైరచ్ఛకపోలమూలగళితైః పర్యస్త నేత్రోత్పలా
బాలా కేవలమేవ రోదితి లుఠల్లోలాలకై రశ్రుభిః. ౨౭

అవ:—ముగ్ధానాయికను గూర్చి కవివా.

చ. చెలివలనన్ ప్రబోధమును జెందమి హేమ మరల్చు విభ్రమం
బుల నయగౌరవుం బలుకుపోకడలం బతికూర్మితప్పిదం
బులు వెలిఁబుచ్చనేరమిని ముంగురు లిట్టటులాడఁ జెక్కులం
దొలఁచుచు బాష్పముల్ గుఱియఁ దూలె నొకేగతి బాల వేలయై.

శ్లో. భవతువిదితం వ్యర్థాలాపై రలం ప్రియ గమ్యతాం
తనురపినతే దోషోఽస్మాకం విధిస్తు పరాఙ్ముఖః
తవయది తథారూఢం ప్రేమ ప్రపన్న మిమాం దశాం
ప్రకృతి తరళేకానః పీడాగతే హతజీవితే. ౨౮

అవ:—అపరాధినినాయకుని నాయికబెదరించుట. నాయిక ధీరాధీర.

ఉ. ఔఁదెలిసెం బ్రియా ! వలదు వ్యర్థపుమాటలు పొమ్ము నీదెసన్
లే దిసుమంతదోసము ఫలించెను మాదురదృష్ట మీగతిన్
దాదృశసుస్థిరప్రణయతత్వము నీకిపు డిట్టులైన ని
ష్ఖేదముగాదె లోలహతజీవన మూడిననైన మాకికన్. 28

శ్లో. ఉరసి నిహిత స్తారోహారః కృతాజఘనే ఘనే
కలకలవతీ కాఞ్చీ పాదౌ రణ న్మణినూపురౌ
ప్రియ మభిసర స్యేవం ముగ్ధే త్వమాహతడిణ్డిమా
యది కి మధికత్రాసోత్కమ్పా దిశ స్సము దీక్షసే. ౨౯

అవ:—రాగాతిశయముచే తగనివేషమున ప్రియునభిసరించుచున్న
నాయికను సఖి మందలించుచున్నది. నాయిక స్వీయ, మధ్య.

చ. ఉరమునఁ దారహారములు, నుజ్జ్వలకాంచి నితంబసీమ, నూ
పురములు పాదపద్మములఁ బూనుచు నాహతడిండిమాకృతిఁ
మొరయుచు నాథునిం గవయఁబోయెదునీవు వడంకఁ బాఱి కా
తరవలె నీవిధాన ముగుదా! పరికించెదవేల దిక్కులన్. 29

శ్లో. ప్రాతః ప్రాత రుపాగతేన జనితా నిర్నిద్రతా చక్షుషో
ర్మన్దాయా మమ గౌరవవ్యపనయా దుత్పాదితం లాఘవమ్
కిం ముగ్ధే నకృతు త్వయా మరణ*భీర్ముక్తామయాగమ్యతాం
దుఃఖం తిష్ఠసి యచ్చ పథ్య మధునా కర్తాస్మి తచ్ఛ్రోష్యసి. ౩౦

అవ:—ఇందు నాయకుని వైద్యునిఁగాను తన్ను రోగిణింగాను నాయిక పలుకుచు నుపాలంభించుచున్నది. నాయిక స్వీయ, ధీర, ప్రగల్భ, ఖండితయు.

చ. నిరతము వేఁగునంతకు వినిద్రత చొప్పడ మందురాలికిన్
గురుతఁ దొలంచి లాఘవము గూర్చినముగ్ధుఁడ వేమి సేయవో
వరుఁడ భయంబు తీరె నెదిపథ్యమొ దానిని యాచరింతు స
త్వరముగఁ బొమ్ము గాసిలక వైళమ వింతువుగాక సర్వమున్.

శ్లో. ప్రస్థానం వలయైః కృతం ప్రియసఖై రస్రై రజస్రం గతం
ధృత్యా నక్షణ మాసితం వ్యవసితం చిత్తేన గన్తుం పురః
యాతుం నిశ్చితచేతసి ప్రియతమే సర్వే సమం ప్రస్థితం
గన్తవ్యే సతి జీవిత ప్రియసుహృత్సార్థః కిముత్సృజ్యతే. ౩౧

అవ:-తనభర్త దేశాంతరమేగుచుండ తననిరాశాభావము ప్రకటించుచున్ననాయికవాక్యము. నాయిక మధ్య, ప్రగల్భ, స్వీయ.

---

* "మరణభీ" యను రసికసంజీవనీ వ్యాఖ్యాసమ్మత పాఠమిచ్చట గ్రహింపబడినది— "రమణభీ" యని శృంగారదీపికా పాఠము.

మ. తొరఁగెం గంకణముల్ హితాశ్రుకణముల్ దూలెన్ క్షణంబేని
యున్, దిరమై నిల్వదు ధైర్య మీమనసు ముందేపోవు నీకిలిగా
దరలంబాజీనభర్తతోడ సఖిబృందంబెల్లఁబో వెన్కకున్
మరలంజొచ్చెదవేల మిత్రగణము న్వర్జించి యోజీవమా ! 31

శ్లో. సుప్తోఽయం సఖి సుప్యతా మితి గతాస్సఖ్య స్తతోఽనన్తరం
ప్రేమావేశితయా మయా తరళయా న్యస్తం ముఖం తన్ముఖే
జ్ఞాతేఽళీకనిమీలనే నయనయో ర్ధూర్తస్య రోమాఞ్చతో
లజ్జాసీన్మమ తేన సాఽప్యపహృతా తత్కాలయోగ్యైః క్రమైః.

అవ:—నాయిక తాను ప్రేమాతిశయముచేతఁజేసిన చాపలమును సఖితోఁజెప్పుకొనుట. నాయికస్వీయ, మధ్య, నాయకుఁడను కూలుఁడు.

మ. మాలతీ ! నాథుఁడు నిద్రఁజెందె నిఁక నీవు న్నిద్రఁబొమ్మంచు నె
చ్చెలు లేగం బ్రణయంబునం జపలనై చెక్కిళ్లతోఁజెక్కులం
గలయంగూరిచి గగ్గురుల్ గని యళీకస్వాపమం చేసు ల
జ్జిలునంతన్ సమయోచితక్రియలఁదేల్చెన్ నన్నుఁబ్రాణేశుఁడున్.

శ్లో. కోపోయత్ర భ్రుకుటిరచనా విగ్రహో యత్ర మౌనం
యత్రాన్యోన్య స్మిత మనునయో దృష్టిపాతః ప్రసాదః
తస్యప్రేమ్ణ స్తదిద మధునా వైశసం పశ్యజాతం
త్వం పాదాన్తే లుఠసి నచమే మన్యుమోక్షః ఖలాయాః 33

అవ:—నాయకుని యపరాధాతిశయమునకు కోపించి నాయిక యాతని వక్రోక్తుల నిందించుట. నాయిక స్వీయ, ధీర, ప్రగల్భ.

చ. అలుగుట భ్రూకుటిం గలహమౌటను మౌనముచేత సాంత్వనం
బెలనవుచేఁ బ్రసాద మభివీక్షణచేఁ బ్రకటించుచుం గరం
బలరెడు ప్రేమ కిప్పు డిటు హాని జనించెడుఁ జూడుమీ పద
మ్ములఁబడినావు నీ వుడుగఁబోవదు కోపము నాకు దుష్టకుణ్.33

శ్లో. సుతను జహిహి మౌనం పశ్య పాదానతం మాం
న ఖలు లవకదాచి త్కోప ఏవం విధో౽భూత్
ఇతి నిగదతి నాథే తిర్య గామీలితాక్ష్యా
నయనజల మనల్పం ముక్త ముక్తం నకిఞ్చిత్. ౩౪

అవ:—కవివాక్యము. నాయిక స్వీయ మధ్య.

చ. అటమటలేక పల్కవె శుభాంగి ! పదానతు నన్నుఁ జూడు నీ
విటు పటుకోప మెన్నడు జనింపదు మున్నని నాథుఁ డెంతయుణ్
గటకటపల్కుచుండ నరగన్ను లొకించుక యోరసేయుచున్
బొటబొట బాష్పముల్ గురిసె బోటి మరేమియు మాటలాడకే.

శ్లో. గాఢాలిఙ్గన వామనీకృత కుచప్రోద్భిన్న రోమోద్గమా
సాన్ద్రస్నేహ రసాతిరేక విగళత్కాఞ్చీ ప్రదేశామ్బరా
మా మామానదమాతి మా మలమితి క్షామాక్షరోల్లాపినీ
సుప్తా కిన్ను మృతాను కిం మనసి మే లీనా విలీనానుకిమ్. ౩౫

అవ :—నాయకవాక్యము. నాయిక పరకీయ. కన్య.

ఉ. గగ్గురు లుప్పతిల్ల బిగిఁ గౌగిట నుబ్బినగుబ్బ లొత్తఁగా
వెగ్గలపుం దమిం బటము వీడి కటి న్నటియింప నోలిమైఁ
దగ్గురవంబుతో వలదు దర్పహరా వలదంచు నిద్దురన్
గ్రొగ్గెనొ, స్రగ్గెనో, కలసిపోయెనొ, లేమ మదంతరాత్మలోన్.

శ్లో. పటాలగ్నే పత్యౌ నమయతి ముఖం జాతవినయా
హఠాశ్లేషం వాఞ్ఛత్యపహరతి గాత్రాణి నిభృతమ్
అశక్తాచాఖ్యాతుం స్మితముఖసఖీ దత్తనయనా
హ్రియా తామ్యత్యన్తః ప్రథమ పరిహాసేనవవధూః. ౩౬

అవ :—నవసంగమంబున లజ్జాపరాధీనయైననాయికదశను గవివర్ణించుచున్నాఁడు. నాయిక ముగ్ధ. స్వీయ.

చ. వలువను జెల్వుఁడంటునెడ వ్రాల్చు మొగంబు, వినీతయై, కవుంగిలిఁగొనఁబో భృశంబును ఓగించును గాత్రములెల్ల, నేమియుం బలుకదు నవ్వుచున్నచెలిపై వెడచూపులఁజిమ్ముచున్ మదిం గొలకొలనెందు లజ్జఁదొలికహటమి నూత్నవధూటి మాటికిన్.

శ్లో. నాపేతోఽనునయేన యఃప్రియసుహృద్వాక్యైర్నయస్సంవృతో
యోదీర్ఘం దివసం విషహ్యహృదయే యత్నాత్కథఞ్చిద్ధృతః
అన్యోన్యస్యహృతే ముఖే విహితయో స్తిర్యక్కథఞ్చిద్దృశో
స్సంభేదే సపది స్మితవ్యతికరే మానో విహాస్యోజ్ఝితః. ౩౭

అవ :—కవివాక్యము. నాయిక స్వీయ. మధ్య.

చ. చెలి బతిమాలినన్ హితులు సెప్పిన నుంతయు దీరువోక తో య్యలిఁ బ్రియు వేఁచి వేఁచి పవలంతయు రాతిరి పాన్పునందు మో ములు వెడకొత్తిగించి కడుమూర్ఖతఁజూపిన మాన మెట్టులో కలసినచూడ్కులం జనె వికావికలై నగుమొల్కలొల్కఁగన్.

శ్లో. గతేప్రేమావేశే ప్రణయబహుమానే విగళితే
నివృత్తే సద్భావే జన ఇవ జనే గచ్ఛతి పురః
తదుత్ప్రేక్ష్యోత్ప్రేక్ష్య ప్రియసఖిగతాం స్తాంశ్చ దివసాన్
నజానే కోహేతుర్దళతి శతధా యన్నహృదయమ్. ౩౮

అవ :—నాయకునిచేఁబరిభూతయైననాయిక సఖితో మొఱపెట్టుకొనుట.

చ. బలితపుఁబ్రేమ, మానసము, భావవిశుద్ధియు మాసిపోవఁగా
చెలియరో! లాఁతివానివలెఁజెంగట నేగుచునున్నవీని న
త్యలఘుతరానురాగమున హాయిగఁబుచ్చిన యాదినంబులం
దలఁచి తలంచి గుండె శతధా పరిభిన్నముగా దిదేలొకో ? 38

శ్లో. చిరవిరహిణో రుత్కణ్ఠా ర్త్యా శ్లథీకృతగాత్రయో
ర్నవ మివ జగ జ్జాతం భూయశ్చిరా దభినన్దతోః
కథమపి దినేదీర్ఘే యాతే నిశా మధిరూఢయోః
ప్రసరతి కథా బహ్వీ యూనో ర్యథా చ తథా రతిః. ౩౯

అవ :—కవివాక్యము.

చ. చిరవిరహార్తిఁబెన్వగలు సెంది శ్లథీకృతగాత్రవల్లులై
తిరిగి సమాగమంబగుటఁ దేరినప్రాయపుటాల్మగల్ కడుం
బెరిగినయప్పవల్ గడపి పేరుము లీరికలెత్తఁగాఁ బర
స్పరకథనంబుతోడి రతిసంగతిఁబుచ్చిరి రాత్రియంతయున్. 39

శ్లో. దీర్ఘాతోరణమాలికా విరచితా దృష్ట్యైవ నేన్దీవరైః
పుష్పాణాం ప్రకరస్మితేన రచితో నో కున్దజాత్యాదిభిః
దత్త స్స్వేద ముచా పయోధర భరేణార్ఘ్యోన కుమ్భామ్భసా
స్వైరే వావయవైః ప్రియస్య విశత స్తన్వ్యా కృతం మఙ్గళమ్.

అవ :—కాంతుఁడు ప్రవాసమునుండిరాఁగాఁగాంతకుంగలిగిన సంతో
షముయొక్క చిన్నెలను కవి వర్ణించుచున్నాఁడు.

ఉ. తోరణఁగట్టెఁజూడ్కులనె లొయ్యలి, కాదల కల్పలీ; సుమా
సారము నవ్వుల న్నినిచె, జాదులఁగాదు, చెమర్చు చన్గవన్
గూరిచె నర్ఘ్యముఙ్, సజలకుంభయుగంబునఁగాదు; మంగళా
చారముఁదీర్చె వచ్చు తనస్వామికి నీగతి నంగకంబులన్. 40

శ్లో. కాన్తే సాగసి యాపితే ప్రియసఖీవేషం విధా యాగతే
భ్రాన్త్యాలిఙ్గ్య మయా రహస్యముదితం తత్సఙ్గమా పేక్షయా
ముగ్ధే దుష్కర ఏష ఇత్యతితరా ముక్త్వా సహాసం బలా
దాలిఙ్గ్య చ్ఛలితాస్మి రేన కితవే నాద్య ప్రదోషాగమే. ౪౧

అవ :—అపరాధినాయకుఁడు నాయికచే వెడలనడువంబడి సఖీవేష
మున నాయికం గలయుట. నాయికమధ్య. నాయకుఁడు శఠుఁడు.

చ. కలుషితుఁడై నికారమునుగాంచి వెసం జని సంజ చేటి రూ
పొలయఁగ నన్ను డాయ సకియోయని కాంతునిఁదెమ్మటంచు నేఁ
దెలిపిన దుర్ఘటంబిదికదే ముగుదా ! యని దోసకారియై
లలనరో ! నవ్వి కౌఁగిట బలాత్కృతిఁజేరిచి మోసగించెనే. 41

శ్లో. ఆశఙ్క్యప్రణతిం పటాన్తపిహితౌ పాదౌ కరో త్యాదరా
ద్వ్యాజే నాగత మావృణోతి హసితం న స్పష్ట ముద్వీక్షతే
మ య్యాలాపవతి ప్రతీపవచనా సఖ్యా సమం భాషతే
తన్వ్యా స్తిష్ఠతు నిర్భరప్రణయితా మానోఽపి రమ్యోదయః.

అవ :—నాయకుఁడు తననాయికయొక్క మానప్రకారమును వర్ణిం
చుట. నాయిక ప్రగల్భ.

చ. పటమునఁగప్పు నాదృతినెపంబున మ్రొక్కఁగనీక పాదముల్
చటుకున నవ్వునాపు నొకసాకునఁగన్గొన వాక్యమెత్తి వి
స్ఫుటముగ, నేను బల్కఁ దనబోటికిఁజెప్పు జవాబు కాంత యు
త్కటమగుప్రేమమొక్కటియెకా దల కోపముగూడ రమ్యమే.

శ్లో. సాయావన్తి పదా న్యళీకవచనై రాళీ జనైః పాఠితా
తావ త్త్యేవ కృతాగసోఽద్భుతతరం వ్యాహృత్య పత్యుః పురః
ప్రారబ్ధా పరతోయథా మనసిజ స్యేచ్ఛాతథా వర్తితుం
ప్రేమ్ణో మౌగ్ధ్యవిభూషణస్య సహజః కోఽప్యేష కాన్తః క్రమః.

అవ :—కవివాక్యము. నాయిక. ముగ్ధ.

ఉ. మాయలమారిచేడియలు మప్పినటుల్ వడిఁబల్కి వెన్కఁబం
చాయుధు నాజ్ఞల న్నెఱపె నన్నియు బాల కృతాపరాధుఁడౌ
నాయకుచెంత మౌగ్ధ్యకలనం బరిపూరితమైన ప్రేమకుం
బ్రాయిక మిట్టిరీతు లతిభాసురముల్ వివరింప శక్యమే. 43

శ్లో. దూరాదుత్సుక, మాగతే వివలితం, సంభాషిణి స్ఫారితం,
సంశ్లిష్యత్యరుణం, గృహీతవసనే సంకోచిత భ్రూలతమ్,
మానిన్యా శ్చరణానతివ్యతికరే బాష్పామ్బు పూర్ణం, క్షణాత్
చక్షుర్జాత మహోప్రపఞ్చచతురం జాతాగసి ప్రేయసి. ౪౪

అవ :—కవివాక్యము. నాయిక మధ్య. ప్రగల్భ.

చ. ఎడముగ సాపరాధు హృదయేశుఁగనుంగొని పొంగె డాసినన్
సుడివడెఁబల్కరింప విడఁజొచ్చెఁ గవుంగిటఁజేర్పఁబో మెఱుం
గడరెఁబటంబు ముట్ట బొమ లల్లె మొగిడ్చెను బల్క నీరిడెన్
గడియకె పెక్కుచందములఁగ్రాలెను మానినిచూడ్కి వింతగన్.

శ్లో. అజ్ఞానా మతి తానవం కుత ఇదం కమ్పశ్చ కస్మా త్త్వతో
ముగ్ధే పాణ్డు కపోల మానన మితి ప్రాణేశ్వరే పృచ్ఛతి
తన్వ్యా సర్వ మిదం స్వభావత ఇతి వ్యాహృత్య పక్ష్మాన్తర
వ్యాపీ బాష్పభర స్తయా వళితయా నిశ్వస్య ముక్తోన్యతః. ౪౫

అవ :—కవివాక్యము. నాయిక విరహోత్కంఠిత. మధ్య.

ఉ. ఏల కృశించితే ? యిటుల నేల వడంకెదె ? యేల చెక్కిళుల్
పాలినవే ? యటంచుఁ బతి ప్రశ్నమొనర్పఁగ నాకు నన్నియుం
బోల స్వభావజంబులని మోము మరల్చుచు వెచ్చనూర్చి య
బ్బాలిక రాల్చె ఱెప్పలకుఁబర్విన బాష్పఝరంబు లోరగన్. 45

శ్లో. రాత్రౌ వారిభరాలసామ్బుదరవోద్విగ్నేన జాతాశ్రుణా
పాన్థే నాత్మవియోగదుఃఖపిశునం గీతం తథోత్కణ్ఠయా
ఆస్తాం జీవితహారిణః ప్రవసనాలాపస్య సంకీర్తనం
మానస్యాపి జలాఞ్జలి స్సరభసం లోకేన దత్తో యథా. ౪౬

అవ: —కవివాక్యము.

ఉ. గానముసేసె రాతిరి యొకానొక పాంథుఁడు మేఘమందర
ధ్వానము వింటచేఁ గలఁగి బాష్పము రాల్చి వియోగదుఃఖసం
దానకమైనగీతికను దానిని విన్న దురంతమైన ప్ర
స్థానమయేల పేరలుకసైతము నెవ్వరుఁగోరనట్లుగన్. 46

శ్లో. స్వం దృష్ట్వా కరజక్షతం మధుమదక్షీ బాఽవిచార్యేర్ష్యయా
గచ్ఛన్తీ 'క్వనుగచ్ఛసీ' తి విధృతా బాలా పటాన్తే మయా
ప్రత్యావృత్తముఖీ సబాష్పనయనా సా ముఞ్చముఞ్చేతిమాం
కోపప్రస్ఫురితాధరం య దవదత్త త్కేన విస్మార్యతే. ౪౭

అవ: —నాయకోక్తి.

శా. హాలాపానమున న్నఖక్షతము నాయంగంబునన్ స్వీయమం
చాలోచింపక యేగుచో 'నెచటికే' యంచేను జేలాంచముం
గేలంబట్టిన మోముఁద్రిప్పి కనుల న్నీర్నించి కోపాకులా
లోలోష్ఠంబుగ 'వీడువీడు' మనుపల్కుల్ నెమ్మదిం బాయునే?

శ్లో. చపలహృదయే కిం స్వాతన్త్ర్యా త్త్వయా గృహ మాగత
శ్చరణపతితః ప్రేమార్ద్రార్ద్రః ప్రియ స్సముపేక్షితః
తదిద మధునా యావజ్జీవం నిర స్త సుఖోదయా
రుదితశరణా దుర్జాతానాం సహస్వ రుషాం ఫలమ్. ౪౮

అవ: —నాయికతో చెలికత్తె నాయికపక్షమున వాదించుచున్నది.

ఉ. చంచలచిత్త! యేటికిటు స్వైరిణివై యిలుసేరినట్టి పా
దాంచితుఁడైన ప్రేమతరళాత్ము మనోహరు నూరకే యుపే
క్షించితి జీవితాంతముగఁజేకురె దాన నసౌఖ్య మింక శో
కించుటె నీదుకృత్యము సహింపుమ దుష్టరుషాఫలంబులన్. 48

శ్లో. నభసి జలదలక్ష్మీం సాస్రయా వీక్ష్య దృష్ట్యా
ప్రవససి యది కాన్తే త్యర్ధముక్త్వా కథఞ్చిత్
మమ పట మవలమ్బ్య ప్రోల్లిఖన్తీ ధరిత్రీం
య దనుకృతవతీ సాత్ర వాచో నివృత్తాః. ౪౯

అవ: —నాయిక స్వీయ. మధ్య.

గీ. కంట నీరొల్క మింటిమేఘములఁగాంచి
"అరుగుచో నాథ"అని సగమాడి యెటులొ
కేల నాకొంగుపట్టి కాల్ నేల గీసి
చెలువ చేసినచేతలు చెప్పవశమె? 49

శ్లో. బాలే, నాథ, విముఞ్చమానిని రుషం, రోషాన్మయా కిం కృతం?
ఖేదోఽస్మాసు, నమేపరాధ్యతి భవాన్ సర్వేపరాధా మయి,
తత్కిం రోదిషి గద్గదేన వచసా? క స్యాగ్రతో రుద్యతే?
నన్వేతన్మమ, కాతవాస్మి! దయితా నాస్మీత్యతో రుద్యతే. ౫౦

అవ:—నాయికానాయకుల ఉక్తిప్రత్యుక్తిరూపమైనవాక్యమాల.

శా. బాలా! స్వామి! తొరంగుకోపమును,గోపంబేమిచేసె౯? మముం
దూలించెన్, దమతప్పు లే దొకటి మాదోసంబె సర్వంబు నిం
కేలా గద్గదశోక? మేరికడ నాయేడ్పుల్ వినన్వచ్చె? మా
ప్రోల౯; నేఁదమకెవ్వతె౯? ప్రియవు,కాఁబోనందుకేయేడ్పుటల్.

శ్లో. శ్లిష్టః కణ్ఠే కిమితి నమయా మూఢయా ప్రాణనాథ?
శ్చుమ్బిత్యస్మి న్వదనవినతిః కిం కృతా? కిం నదృష్టః?
నోక్తః కస్మా దితి నవవధూచేష్టితం చిన్తయన్తీ
పశ్చాత్తాపం వహతి తరుణీ ప్రేమ్ణి జాతే రసజ్ఞా. ౫౧

అవ:—నాయిక మున్ను తాను నవోఢగానున్నప్పుడు తాను లజ్జచే
నాత్మవంచనము చేసికొంటినని యిప్పుడు తరుణియై రసజ్ఞయయి
పశ్చాత్తాపము పొంది తన్ను నిందించుకొనుట.

చ. చనవున నాథు నేల బిగిసందిటఁజేర్పకపోతి నేల చుం
బనమొనరింపఁబో మొగము ద్రాల్చితి? నేమని చూడనైతి? నే
మని పలుకాడనైతిని రసానుభవజ్ఞ యొకర్తు మౌగ్ధ్యవ
ర్తనముఁదలంచి లజ్జ బిగితప్పినవేళఁదపించె నెంతయున్. 51

శ్లో. వాన్తై ర్లోచనవారిభిః సశపథైః పాదప్రణామైః ప్రియై
రన్యైర్వా వినివారయన్తి కృపణాః ప్రాణేశ్వరం ప్రస్థితమ్;
ధన్యాహం వ్రజ మఙ్గళం సుదివసం ప్రాతః ప్రయాతస్యతే
యత్స్నేహోచిత మీహితం ప్రియతమ త్వం నిర్గతః శ్రోష్యసి.

అవ: —నాయకుని పయనమును నాయిక వక్రోక్తిచే అంపుచున్నది.

ఉ. ఒట్టులఁబెట్టి, బాష్పములనోడ్చి, పదంబులు ముట్టి, యెట్టెటో
కట్టడి నిల్పుచుంద్రు చసుకాంతులఁగొందఱుదీనకాంత, లే
నట్టులఁగాను, ధన్యను, ప్రియా! చనుమేకువ సుప్రభాతమౌ
నెట్టును,వెన్క విందు వతిహృద్యము మప్ప్రణయార్హకృత్యమున్.

శ్లో. లగ్నానాంశుకపల్లవే భుజలతా, న ద్వారదేశోస్థితం,
నోపాపాదయుగే ముహుర్నిపతితం, తిష్ఠేతినోక్తం వచః,
కాలే కేవల మమ్బుదాళిమలినే గన్తుం ప్రవృత్తః శ్శఠః
తన్వ్యా బాష్పజలౌఘకల్పితనదీపూరేణ రుద్ధః ప్రియః. ౫౩

అవ: —కవివాక్యము. నాయిక స్వీయ. మధ్య.

గీ. కొంగుఁగొనలేదు తా నడ్డుకొనఁగలేదు
అడుగులను వ్రాలలేదాగుమనఁగలేదు
మొయిళు లలమినకారునం బయనమైన
చెలువుఁగన్నీటి వాకచేఁజెలువ నిలిపె. 53

శ్లో. విరహవిషమః కామః కామం తనుం కురుతే తనుం,
దివసగణనాదక్షః స్వైరం వ్యపేతఘృణో యమః,
త్వమపి వశగో మానవ్యాధే ర్విచిన్తయ నాథహే
కిసలయమృదు ర్జీవే దేవం కథం ప్రమదాజనః. ౫౪

అవ:—సఖి నాయకుని మందలించుచున్నది.

చ. కరము వియోగదుస్సహుండు కాముండు కాయము గావనేయు ని
ష్కరుణ యముండు నంత్యదివసంబులు లెక్కిడుచుండె జాణ మా
నరుజకుం జిక్కితీవు సిక నాథ! తలంపంగవోయి! యెట్టు లీ
తరుణికి సాలతుల్య వనితాజన మూగంగనేర్చుం బ్రాణముల్. 54

శ్లో. పరిమ్లానే మానే, ముఖశశిని తస్యాః కరధృతే,
మయిక్షీణోపాయే ప్రణిపతన మాత్రైకశరణే,
తదాపక్ష్మప్రాన్త వ్రజపుటనిరుద్ధేన సహసా
ప్రసాదో బాష్పేణ స్తనతట విశీర్ణేన కథితః. ౫౫

అవ:—నాయకోక్తి. నాయిక స్వీయ. మధ్య.

చ. పొలయలుకం దెమల్చి పెరపూనికఁగానక పాదపంకజ
మ్ములపయి నేను వ్రాలినఁగపోలము పాణితలంబు సేర్చి య
ప్పొలతుక పక్ష్మపుం గొనల ముత్తపుదొప్పల నిల్వరించి గు
బ్బలఁదొలఁకించు బాష్పముల పాటునఁగంటి ప్రసన్నభావమున్.

శ్లో. కృతోదూరాదేవ స్మితమధుర మభ్యుద్గమ విధిః,
శిరస్యాజ్ఞాన్యస్తా, ప్రతివచనమ ప్యాలపసి చ,
న దృష్టి శ్శైథిల్యం భజత ఇతి చేతో దహతి మే,
నిగూఢాన్తః కోపే కఠినహృదయే సంవృతి రియమ్. ౫౬

అవ:—నాయకుఁడు నాయికను నిందించుట.

ఉ. దూరమునుండి లేనగవుతో దరిఁజేరితి వస్మదాజ్ఞలన్
గారవమొప్ప శీర్షమునఁగ్రైకొనినావు జవాబుచెప్పి తీ
బీరపుఁజూపుమాత్ర మొకవీసము మారక మమ్ము నేర్చెడుౝ
గ్రూరమతీ! యిటుల్ హృదయగోపన చేసెడు రీతులేటికే? 56

శ్లో. ఆస్తాం విశ్వసనం సఖీషు, విదితాభిప్రాయసారే జనే
తత్రాఽప్యర్పయితుం దృశం సలలితాం శక్నోమి నవ్రీడయా,
లోకోఽప్యేష పరోపహాసచతురః సూక్ష్మేఙ్గి తజ్ఞోఽప్యలం,
మాతఃకంశరణం వ్రజామి హృదయే జీర్ణోఽనురాగానలః. ౫౭

అవ:—తన యనురక్తిని ప్రియున కెఱిఁగింప వెరవు గానని నాయిక
దాదితో మొఱపెట్టుకొనుచున్నది.

ఉ. నమ్మినచేటు లిట్లయిరి నాయెడఁగూరిమిఁదెల్పునాథుపైఁ
జిమ్మఁగలేను ప్రేమమును జిల్కెడుచూడ్కులు సిగ్గుచేత సూ
క్ష్మమ్ముగ నాకలించి యెకసక్కెము లాడఁగలారు లోకు లిం
కమ్మరో! యేదిదిక్కు ? ప్రణయాగ్ని మనంబున జీర్ణమయ్యెడిౝ.

శ్లో. శ్రుత్వానామాపి యస్య స్ఫుటఘనపులకం జాయతే యత్సమన్తా
ద్దృష్ట్వాయస్యాననేన్దుం స్రవతి వపు రిదం చన్ద్రికాన్తానుసారి
తస్మిన్నాగత్య కణ్ఠగ్రహనికట పదస్థాయిని ప్రాణనాథే
భగ్నామానస్యచి న్తాభవతిమమపునర్లజ్జయా౽కథఞ్చిత్. ౫౮

అవ:—ఈర్ష్య తాల్పుమని బోధించిన చెలులతో నట్లుచేయలేనిదై
నాయిక చెప్పుకొనుట.

ఉ. ఎవ్వనిపేరువిన్నఁ బులకించునొ మే నఖిలంబు సాంద్రమై
యెవ్వని వక్త్రచంద్రుఁదిలకింప ద్రవింతునొ చంద్రకాంతమ
ట్లవ్విభుఁ డేగుదెంచి సముపాంతికమందుఁ గవుంగిలింపఁ బో
నెవ్విధి నాకు మానము స్ఫురించునె వజ్రమయాత్మకున్ సఖీ !

శ్లో. స న్త్యేవాత్ర గృహేగృహే యువతయ స్తాః పృచ్ఛ గత్వాధునా
ప్రేయాంసః ప్రణమంతి కిం తవ పున ర్దాసో యథా వ ర్తతే;
ఆత్మద్రోహిణి దుర్జనప్రలపితం కర్ణే భృశం మాకృథా
శ్ఛిన్నస్నేహరసా భవన్తి పురుషా దుఃఖానువృత్త్యాయతః. ౫౯

అవ:— మిక్కిలికుపితయగు నాయికను నాయకపక్షమున సఖి బోధించుట.

మ. తరుణుల్ లేరకొ యింటనింటఁ? జని ప్రస్తావింపుమీ వారిఁద
ద్వరులం దెవ్వరు నీదుదాసునిబలెం బాదానతుల్ సల్పిరో
తరుణీ ! కొండెము లాలకించి కదునాత్మద్రోహముం బూనకే
పురుషుల్ సంతతదుఃఖవృత్తి నెనరుం బోఁద్రోతు రొక్కుమ్మడిన్.

శ్లో. స్మరరసనదీపూరే ణోఢాః పున ర్గురుసేతుభి
ర్యదపి విధృతా స్తిష్ఠ న్త్యారా దపూర్ణ మనోరథాః
త దపి లిఖితప్రఖ్యైరఙ్గైః పరస్పర మున్ముఖాః
నయననళినీ నాళానీతం పిబన్తి రసం ప్రియాః. ౬౦

అవ:—కవి వాక్యము.

చ. స్మరకృతరాగవాహినులజాలున లీలగ నోలలాడుచో
గురుజనసేతు వడ్డుకొనఁగూరనికోర్కి సమీపమందె చి
త్తరువులపోలికిఁజేష్టలను దక్కె ప్రియుల్ ప్రియురాండ్రునుం బర
స్పరము/దృశాబిసంబుల/రసంబును గ్రోలుదు రిష్టపూర్తిగన్.60

శ్లో. నిశ్శేషచ్యుత చన్దనం స్తనతటం, నిర్మృష్టరాగోఽధరో,
నేత్రే దూర మనఞ్జనే, పులకితా తన్వీ త వేయం తనుః,
మిథ్యావాదిని దూతి బాన్ధవజనస్యాజ్ఞాత పీడాగమే
వాపీం స్నాతు మితో గతాసి నపున స్తస్యాధమస్యా న్తికమ్.

అవ:—నాయికపంపున నాయకునికడకుం బోయిన దూతి యతనితోఁ
గూడిరాఁగాఁ జిహ్నములచే నావృత్తాంతముం గనిపట్టి నాయిక
దూతిని వక్రోక్తిచే నిందించుట.

చ. తొరఁగెను మోవికెంపు చనుదోయిని గందము డిందె నక్షులం
గరఁగెను గజ్జలంబు పులకల్ పొదలెన్ మెయి నీకు నక్కటా!
యెఱుఁగవు బంధుపీడ వచియించెదు బొంకులు క్రుంక నూతి కీ
వరిగితి వంతె యయ్యధమునందకుఁబోవఁగలేదు దూతికా! 61

శ్లో. మ్లానం పాణ్డుకృశం విలాసవిధురం లమ్బాలకం చాలసం
తే భూయ స్తత్క్షణజాతకాన్తి మధురం ప్రాప్తే మయి ప్రోషితే
సాటోపం రతికేళి దత్తరభసం రమ్యం కిమ ప్యాదరా
త్పీతం యత్సుతనోర్మయా ముఖ మిదం తత్కేన విస్మార్యతే.

అవ:—నాయకోక్తి.

చ. నలిగి కృశించి పాండువయి నష్టవిలాసమునై వికీర్ణ కుం
తలమయి నేను రాఁదిరిగి తత్క్షణజాతవిలాసగర్వమై
కలితరతిప్రగల్భమయి క్రాలి యనిర్వచనీయశోభమైఁ
బొలిచెడిమోము ముద్దుగొను పోఁడిమి నే మఱువంగనేర్తునే? 62

శ్లో. ఆయస్తాకలహం పురేవ కురుతే న స్రంసనే వాససో
భుగ్నభ్రూ రతిఖణ్డ్యమాన మధరం ధత్తేనకేశగ్రహే
అఙ్గాన్యర్పయతి స్వయం భవతి నో వామా హఠాలిఙ్గనే
తన్వ్యా శిక్షిత ఏష సంప్రతి పునః కోపప్రకారోఽపరః. ౬౩

అవ:—నాయికాకోపప్రకారమునుగూర్చి నాయకోక్తి. నాయిక ధీర. ప్రగల్భ.

చ. అలయుచుఁదొంటియట్ల కలహం బొనరింపదు నీవి జార్చుచోఁ
బెలుచ బొమల్ విగించి పెదవిం బలుగీటదు శీర్షమంటుచోఁ
దలఁగ కొసంగునంగములఁదాఁదనయంతనె కౌఁగిలింతకున్
నెలఁతుక క్రొత్తగా నిపుడు నేర్చెను వేఱొకకోపపద్ధతిన్. 63

శ్లో. చిన్తామోహనిబద్ధ్యమాన మనసా మౌనేన పాదానతః
ప్రత్యాఖ్యాతపరాఙ్ముఖః ప్రియతమో గన్తుం ప్రవృత్త శ్శఠః
సవ్రీడై రలసై ర్నిర న్తరలుఠ ద్బాష్పాకులై రీక్షణై
స్తన్వఙ్గ్యా స పునస్తయా తరళయా తత్రాన్తరే వారితః. ౬౪

చ. అతివ విచారముగ్ధవ్రతియౌటఁబదమ్ముమలఁబడ్డనాథు సం
గతిఁగనుఁగోక పల్కమి నికారముగాఁదలపోసి యాతఁడు
ద్ధతిఁజనఁజూచునంత తెలివంది త్రపాలసబాష్పపూర పూ
రితనయనంబులన్ నిలువరింపఁగజాలె లతాంగి క్రమ్మఱన్. 64

శ్లో. క్వచిత్తామ్బూలాక్తః, క్వచిదగరుపఙ్కాఙ్కమలినః,
క్వచి చ్చూర్ణోద్గారీ, క్వచి దపిచ సాలక్తకపదః
వళీభఙ్గాభోగై రలకపతితైః శ్శీర్ణకుసుమైః
స్త్రియో నానావస్థం ప్రథయతి రతం ప్రచ్ఛదపటః. ౬౫

అవ:—కవివాక్యము.

ఉ. ఒక్కెడఁదమ్మగుర్తును మఱొక్కెడ సాంద్రతరాగురుద్రవం
బొక్కెడఁగప్పురంపురజ మొక్కెడ లత్తుకడాగును న్వళీ
ఘక్కికలంతటన్విడినప్రావిరులుం గల దుప్పటంబు దాఁ
దక్కక వెల్లడించె వనితారతిభేదవిశేషపద్ధతిన్. 65

శ్లో. అహంతే నాహూతా కి మపి కథయా మీతి విజనే
సమీపే చాసీనా సరళహృదయత్వా దవహితా
తతఃకర్ణోపాన్తే కిమపి వదతాఘ్రాయ వదనం
గృహీత్వాధమ్మిల్లం మమసఖి నిపీతోధరరసః. ౬౬

అవ:—నాయకుఁడు టక్కుచేసి తనను ముద్దుగొన్నవిధమును నాయిక
చెలితోఁ జెప్పుచున్నది.

ఉ. ఏదొ రహస్యముఁ దెలుపనెంచినపోలికఁ జాటుగాఁగ సం
బోధన మాచరింప నిజమోయనునమ్మిక నేను డాయఁగా
నాదటఁ గర్ణముం గదిసి యాస్యము మూర్కొని శీర్షమంటి యా
స్వాదమొనర్చె నోష్ఠమధుసారము సారెకు వింటివే చెలీ! 66

శ్లో. పుష్పోద్భేద మవాప్య కేళిశయనా ద్దూరస్థయా చుమ్బనే
కాన్తేన స్ఫురితాధరేణ నిభృతం భ్రూసంజ్ఞయా యాచితే
ఆచ్ఛాద్యస్మితపూర్ణగణ్డ ఫలకం చేలాఞ్చలే నాననం
మన్దాన్దోళితకుణ్డల స్తబకయా తన్వ్యా విధూతం శిరః. ౬౭

అవ:—కవివాక్యము. నాయిక స్వాధీనపతిక. ప్రగల్భ. నాయకుఁ
డనుకూలుఁడు.

చ. ఋతుమతియౌటఁ బాన్పు డిగి యింతి యెడమ్ముగఁ బోవఁగాంతుడ
వ్వ్రత మనుకోక గీటి పెదవిం బొమసన్నల ముద్దుఁగోరఁగా
స్మితము దొలంకుచెక్కులను జెన్నగుమోము పయంటఁగప్పుకొం
చతివయుఁగమ్మగుత్తు లొలయాడఁగ నిట్టటు లూచె శీర్షముఁ.

శ్లో. క్వప్రస్థితాసి కరభోరు ఘనే నిశీథే,
ప్రాణేశ్వరో వసతి యత్ర మనః ప్రియో మే;
ఏకాకినీ వదకథం నబిభేషి బాలే,
నన్వస్తి పుఙ్ఖితశరో మదన స్సహాయః.

అవ:—సఖీ నాయికల ప్రశ్నోత్తరములు.

గీ. ఎచటికే బాల ! నడురేయి నేగుచుంటి ?
వాత్మవల్లభుఁడౌ మనోహరుని కడకు
భయములేదొక్కొ ? యొంటిగాఁబయనమైతి
వింట శరమూని మరుఁడు నావెంట లేఁడె ? 68

శ్లో. లోలభ్రూలతయా విపక్షదిగుపన్యాసే విధూతం శిర
స్తద్వృత్తాన్త నిదీక్షణే కృత మనస్కారో విలక్షస్థితః
ఈషత్తామ్రకపోల కాన్తిని ముఖే దృష్ట్వా నతః పాదయో
రుత్సృష్టో గురుసన్నిధా వపి విధి ర్ద్వాభ్యాం నకాలోచితః ౬౯

అవ:—కవివాక్యము. నాయిక ప్రగల్భ. నాయకుఁడు శఠుఁడు.

ఉ. పొందితి వామె నంచుఁగనుబొమ్మలసన్నలఁదెల్పినన్ శిర
స్పందమొనర్చె సాక్ష్యమిడుచాన దెసం గన వ్రాల్చె నొదలన్
గందినమోముఁగాంచి పదకంజములం బడవైచె చూ పిటుల్
పొందుగ గూఢతన్ గురులముందె స్వకార్యము దీర్చె రిద్దరున్.

శ్లో. దృష్టః కాతరనేత్రయా చిరతరం బద్ధ్వాఽఞ్జలిం యాచితః
పశ్చాదంశుక పల్లవేన విధృతో నిర్వ్యాజ మాలిఙ్గితః
ఇత్యాక్షిప్య సమస్తమేవ మఘృణో గన్తుం ప్రవృత్తశ్శఠః
పూర్వం ప్రాణపరిగ్రహో దయితయా ముక్తస్తతోవల్లభః. ౭౦

అవ:—నాయిక యేయుపాయము చేసినను ఆఁగక కోపవ్యాజమున శఠుఁడేగుట.

గీ. చకితదృష్టులఁబఱపి యంజలి ఘటించి
కొంగు చేపట్టి నిలిపి కవుంగిలించి
యెంత వేడిన వినక దవ్వేగు మగని
విడిచెఁ బ్రాణేశ్వతోఁగూడ వెలఁదిమిన్న. 70

శ్లో. లాక్షాలక్ష్మ లలాటపట్ట మభితః కేయూరముద్రాగళే,
వక్త్రే కజ్జలకాళిమా, నయనయో స్తామ్బూల రాగోపరః
దృష్ట్వాకోపవిధాయి మణ్డన మిదం ప్రాత శ్చిరం ప్రేయసో
లీలా తామరసోదరే మృగదృశః శ్వాసా స్సమాప్తిం గతాః.

అవ :—కవివాక్యము.

మ. ఒరపౌ లత్తుకడాగు నెన్నుదుటఁ గేయూరంపుటొత్తుల్ మెడ౯
అరుణాక్షంబులఁదమ్మరాగ మపరం బాస్యంబునం గాటుకల్
దొరమ న్వేకువఁదన్ను డాయువిభునిన్ ధూర్తు న్విలోకించి య
త్తరుణీరత్నము కేళికాబ్జమున సంధానించె నిట్టూర్పుల౯. 71

శ్లో. అద్యారభ్య నహిప్రియే పునరహం మానస్య వాభాజనం
గృహ్ణీయాం విషరూపిణ శ్శఠమతే ర్నామాపి సంక్షేపతః
కిం తేనైవ వినా శశాఙ్కకిరణస్పష్టాట్ట హాసానిశా
నైకోవాదివసః పయోదమలినో యాయాన్మమ ప్రావృషి ?

అవ:—నాయకునిమీఁద నలిగి నాయిక క్షమింపనొల్లక మరణింప నిశ్చయించుకొనుట.

చ. ఇదిమొద లాకఠోరుపయి నించుకకోపముఁబూన వాని పే
రెదఁదలపెట్టఁబోవ నిఁకనెన్నఁడు వాఁడెడయైనవేళ శా
రదనవచంద్రికాస్ఫురితరాత్రియునేని నభాబ్దమాలికా
భ్యుదిత తమోవిలీనదిన మొక్కఁడునే౯ సమకూడకుండునే !

శ్లో. శఠాన్యస్యాః కాఞ్చీమణి రణిత మాకర్ణ్య సహసా
యదాశ్లిష్య న్నేవ ప్రశిథిలభుజగ్రన్థి రభవః
తదేత త్క్వాచక్షే ఘృతమధు మయత్వ ద్బహువచో
విషేణాఘూర్ణన్తీ కి మపి నసఖీ మే గణయతి. ౨౩

అవ:—నాయిక ధూర్తనాయకుని దూఱుచున్నది.

ఉ. వంచక ! కౌఁగిటన్బిగియఁబట్టి పరాంగనకాంచికారవం
బించుక విన్నమాత్ర సడలించితి వేరికిఁజెప్పుకొందునో ?
పొంచి ఘృతంబు తేనె కలబోసినతీయనిపల్కులన్ జెలి
న్మంచిగ నీవు లోఁగొనుట మైకొన దామెయు నాదుమాటలన్.

శ్లో. శూన్యం వాసగృహం విలోక్య శయనా దుత్థాయ కించిచ్ఛనై
ర్నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్
విస్రబ్ధం పరిరభ్య జాతపులకా మాలోక్య గణ్డస్థలీం
లజ్జా నమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుమ్బితా. ౨౪

అవ:—కవివాక్యము. నాయిక స్వీయ. ముగ్ధ. నాయకుఁడనుకూలుఁడు.

చ. మెలఁత యొకింత పాన్పువయి మెల్లఁగలేచి యళీకసుప్తుఁడౌ
చెలువునిమోము సారె పరిశీలనఁజేసి యధార్థనిద్రగాఁ
దలఁచుచుఁజెక్కు ముద్దుగొని దట్టపుగగ్గురు గాంచి లజ్జిలన్
గులుకుచు నాధుఁడుం బొదలుకూరిమి ముద్దులు నించె మాటికిన్.

శ్లో. పాదాసక్తే సుచిర మిహతే వామతా నైవ కాన్తే
మన్దా రమ్భే ప్రణయిని జనే కోపనే కోఽపరాధః
ఇత్థం తస్యాః పరిజనగిరా కోప వేగే ప్రశాన్తే
బాష్పో ద్భేదై స్తదను సహసా నస్థితం నప్రవృత్తమ్. ౨౫

అవ:—కవివాక్యము. నాయిక స్వీయ. మధ్యాప్రగల్భలలో నొకతె. నాయకుఁడు శఠుఁడు.

చ. పదములఁబడ్డ నాథునెడ వంచన సుంతయు లేదు మాటకున్
బదులు వచింపనట్టి ప్రియుపై నెఱకిన్క యదేల ? కోపనా
వదలుమటన్న నెచ్చెలులపల్కులకోప మడంగ వేగమే
పొదలెడు బాష్పధార నిలుపుం గనఁబోదు స్రవింప దింతికిన్.

శ్లో. కథమపి కృత ప్రత్యాసక్తౌ ప్రియే స్ఖలితోత్తరే
విరహకృశయా కృత్వా వ్యాజం ప్రకల్పిత మశ్రుతమ్
అసహనసఖీశ్రోత్ర ప్రాప్తిం విశఙ్క్య ససంభ్రమం
వివళితదృశా శూన్యే గేహే సముచ్ఛ్వసితం పునః. ౭౬

అవ:—కవివాక్యము. నాయిక స్వీయ. మధ్య. నాయకుఁడు ధృష్టుఁడు.

చ. విరహకృశాంగి నెట్లొ పతి వెండియుఁజేరి పరాకుచేత న
న్య రమణిపేరఁబిల్వ కృశతార్తి మిషన్విని పించుకోక సుం
దరి చెలు లాలకించిరని తత్తఱమందుచు నల్దెసల్ కరం
బరయుచు శూన్యగేహమెకదాయని యూఱటఁజెందె నత్తఱిన్.

శ్లో. ప్రత్యాశ్లేష వికీర్ణ చన్దనరజః పుఞ్జ ప్రకర్షాదియం
శయ్యా సంప్రతి కోమలాఙ్గి పరుషే త్యారోప్య మాం వక్షసి
గాఢోష్ఠ గ్రహపీడనాకులతయా పాదాగ్ర సందంశకే
నాకృష్యామ్బరమాత్మనో య దుచితం ధూర్తేన తత్ప్రస్తుతమ్.

అవ:—నాయిక చెలితోఁజెప్పుట. నాయిక స్వీయ. మధ్య. నాయకుఁడనుకూలుఁడు.

చ. కవుఁగిలి రాయిడింబడినగందము పూవులు నొత్తుపాన్పు న
న్నవసుమకోమలీ! యనుచు నన్నెదఁజేరిచి మోవినొక్కి నే
వివశతనున్నఁ గాల్పొటన(వేలునఁజీరఁదెమల్చి యాప్సితం
బవు తనకార్యము న్నెఱపె నాశఠుఁ డోసఖి! యేమిచెప్పుదుᳳ.

శ్లో. అచ్ఛిన్నం నయనామ్బు బన్ధుషు కృతం, చిన్తాగురు ష్వర్పితా,
దత్తం దైన్య మశేషతః పరిజనే, తాప స్సఖీ ష్వాహితః,
అద్యశ్వః పర నిర్వృతిం భజతి సా శ్వాసైః పరం ఖిద్యతే
విస్రబ్ధో భవ విప్రయోగజనితం దుఃఖం విభక్తం తయా. ౭౮

అవ:—దూతి నాయకు నెత్తిపొడుచుచున్నది. నాయిక పరకీయ. కన్య.

సీ. కడలేక జడిగొన్న కన్నీటికాలువల్
బంధుసంతానంబు పాలఁజేర్చె
ఘోరమౌ జింపంపుఁగోతనాఁజనుచింత
తల్లి లోనగువారి తండ నిల్పె
తలవంపు ఘటియించు దైన్య మశేషంబు
పరిజనంబులయొద్ద భద్రపఱిచె
దావాగ్నితులితసంతాపసంభారంబు
ప్రాణసఖులకెల్లఁ బాలుపెట్టె

గీ. నిటుల నేడఁబాటుదుఃఖంబు నెల్ల పంచి
వెచ్చనగు నూర్పులను మాత్రఁ బుచ్చుచుండె
నిత్యసుఖ మబ్బుఁజెలి కింక నేఁడొ రేపొ
నమ్ము నామాట క్రూరా! నిజమ్ము సుమ్ము. 78

శ్లో. స్ఫుటతు హృదయం కామః కామం కరోతు కృశాం తనుం
న సఖి చటులప్రేష్ణా కార్యం పున ర్దయితే న మే
ఇతి సరభసం కోపాటోపా దుదీర్య వచ స్తయా
రమణపదవీ సారంగాక్ష్యా సశఙ్కిత మీక్షితా. ౭౯

అవ:—కవివాక్యము. నాయిక స్వీయ. మధ్య. కలహాంతరిత. నాయకుఁడు శఠుఁడు.

ఉ. గుండియ వ్రీలనీ మరుఁడు క్రూరతఁగాయము గాడనేయనీ
దండుగ లే దికన్ నెనరు దప్పినయీకయిలాట మేలయం
చండజయాన కోపరభసాతిశయంబునఁబల్కుచున్ హృదీ
శుం డరుదెంచుమార్గమును జూచెఁగరం బెళుకొందుచూపులన్.

శ్లో. లీలాతామరసాహతోఽన్యవనితా నిశ్శఙ్క దష్టాధరః
ప్రేయా న్కేసరదూషితేక్షణ ఇవ వ్యామీల్య నేత్రే స్థితః
కాంతాకుట్మలితాననేన దధతీ వాయుంస్థితా తత్రసా
భ్రాంత్యాధూ ర్తతయా తదానతి మృతేతేనాభవచ్చుంబితా. ౮౦

అవ:—కవివాక్యము. నాయిక స్వీయ. మధ్య. నాయకుఁడు శఠుఁడు.

చ. పరసతిపంటినొక్కు ప్రియువాతెఱపైఁగని కిన్కఁగేళికాం
బురుహముతో దమింపఁబతి మోడ్చెఁగనుల్ సతి రాలెఁబోలుఁ గే
సరములటంచు నూదుటకు సాచి మొగంబు బిగింప నాతఁడుం
గఱచెఁజటుక్కునన్ బెదవిఁగాళ్లపయింబడి వేడకుండనే. 80

శ్లో. పురాఽభూ దస్మాకం ప్రథమ మవిభిన్నా తను రియం
తతోఽను త్వంప్రేయాన్ వయ మపి హతాశాః ప్రియతమాః
ఇదానీం నాథ స్త్వం వయ మపి కళత్రం కి మపరం
హతానాం ప్రాణానాంకులిశ కఠినానాం ఫల మిదమ్. ౮౧

అవ:—నాయిక క్రమక్రమముగాఁ బ్రేమదూరుఁడగుచున్ననాయకు నుపాలంభించుచున్నది. నాయిక స్వీయ. ప్రగల్భ. నాయకుఁడు శఠుఁడు.

చ. మొదట నభిన్నభావమునఁ బొల్చితి మిర్వుర మొక్కదేహమై
పిదపఁ బ్రియుండవీవయితి ప్రేయసినైతి నభాగ్యనేను ని
య్యదనునఁ జూడ నీవు పతివైతి కళత్రమనైతి నేఁగటా!
యెదవె నికృష్టజీవనము లూఁతకనిల్చినదుష్ఫలం బిటుల్. 81

శ్లో. ముగ్ధేముగ్ధత యైవ నేతు మఖిలం కాలం కిమారభ్యతే?,
మానం ధత్స్వ ధృతిం బధాన ఋజుతాం దూరేకురు ప్రేయసి;
సఖ్యైవం ప్రతిబోధితా ప్రతివచస్తామాహ భీతాననా
నీచైశ్శంసహృది స్థితోహినను మే ప్రాణేశ్వర శ్శ్రోష్యతి. ౮౨

అవ:—కవివాక్యము. నాయిక స్వీయ. ముగ్ధ. నాయకుఁడు శఠుఁడు.

మ. కలకాలం బిటు ముద్దవై కడుప నాకాంక్షించితే ముద్దియా!
పొలయల్కన్ ధృతిఁ బూను మెత్తదనముం బోకార్పుమీయంచు నె
చ్చెలి బోధింపఁగ మెల్లనం బలుకవే చేటీ విభుం డాత్మలో
పల నున్నాఁడు వినంగలాఁడనియె నప్పద్మాక్షి భీతాస్యయై. 82

శ్లో. ఆలమ్భ్యాఙ్గణవాపికాపరిసరే చూతద్రుమే మఞ్జరీం
సర్పత్సాన్ద్రపరాగలమ్పట రణద్భృఙ్గాఙ్గనాశోభినీం
మన్యే స్వాం తను ముత్తరీయశకలే నాచ్ఛాద్య బాలాస్ఫుర
త్కణ్ఠధ్వాననిరోధకమ్పితకుచ శ్శ్వాసోద్గమా రోదితి. ౮౩

అవ:—ప్రవాసగతుఁడగు నాయకుఁడు వసంతారంభమున నాయిక యవస్థ నూహించుచున్నాఁడు. నాయిక స్వీయ. మధ్య. ప్రోషిత పతిక. నాయకుఁ డనుకూలుఁడు.

ఉ. ముంగిట బావిచెంత నళిబోటులు పుష్పాడి నాడిపాడ ర
క్తింగొనుమావిగుత్తి నొకకేలను లీలఁగఁబట్టి పైటచే
స్వాంగముఁగప్పుచుః రుదిత మాపుట రొమ్మెగయంగ నూర్పు
లుప్పొంగి మదర్థమై తలిరుఁబోఁడి కనుంగొనుచుండ దీనతః.

శ్లో. అనాలోచ్య ప్రేమ్ణః పరిణతి మనాదృత్య సుహృద
స్త్వయాఽకాణ్డేమానః కిమిత తరళే సంప్రతి కృతం ?
సమాకృష్టాహ్యేతే ప్రళయదహనోద్భాసురుశిఖాః
స్వహస్తేనాఽఙ్గారా స్తదల మధునాఽరణ్యరుదితైః. ౭౪

అవ:—నాయకునిచే లోఁగొనఁబడినసఖి నాయికను బెదరించుచున్నది. నాయిక స్వీయ. మధ్య. కలహాంతరిత. నాయకుఁడు శఠుఁడు.

చ. చెలుల హితోక్తులన్ సరకుసేయక కూరిమి మొప్పమంచు లోఁ
దలఁపక లోలవై యిటు వృథా పొలయల్క వహించి యేల గా
సిలెదవు ? వేడినిప్పుచెయిచేతుల నీతల కెత్తుకొంటి వో
కలికి ! యరణ్యరోదనముగాదొకో ? నీ విఁక నెంతయేడ్చినన్.

శ్లో. కపోలే పత్త్రాళీకరతల నిరోధేన మృదితా,
నిపీతో నిశ్వాసై రయ మమృత హృద్యోఽధరరసః,
ముహుః కణ్ఠేలగ్న స్తరళయతి బాష్పః స్తనతటం
ప్రియోమన్యుర్జాత స్తవ నిరనురోధేనతు వయమ్. ౭౫

అవ:—నాయకునిపక్ష మవలంబించినచెలులు నాయికతోఁ జెప్పుచున్నారు. నాయిక స్వీయ. మధ్య. నాయకుఁడు శఠుఁడు.

చ. కరతలపీడచేఁ జెరగె గండతలంబునఁ బత్రరాజి పా
టెఱమధుసార మారె నతితీవ్రతరోచ్ఛ్వసితంపువేడిమిన్
గర మదరించె రొమ్ముదరిఁ గంఠగతాశ్రువు లింత వెట్టిబా
గఱివయితేమె ? నెచ్చెలులకం బెను గోపమె తీపియయ్యెనా ? 85

శ్లో. ఆయాతేదయితే మనోరథశతై ర్నీత్వా కథం చిద్దినం
గత్వావాసగృహం జడేపరిజనే దీర్ఘాం కథాం కుర్వతి
దష్టాఽస్మీత్యభిధాయ సత్వరపదం వ్యాధూయ చీనాంశుకం
తన్వఙ్గ్యారతికాతరేణ మనసా నీతః ప్రదీపశ్శమమ్. ౮౬

అవ:-కవివాక్యము. నాయిక స్వీయ. ప్రగల్భ. నాయకుఁడనుకూలుఁడు.

ఉ. ఊరికిఁబోయి వెండియుఁబ్రియుం డిలుసేరఁగ నాఁటిప్రొద్దు వేఁ
గోరికలూరఁబుచ్చి నిశిఁగోమలి పానుపుఁజేర నెచ్చెలుల్
మోఱకులై యదేగొడవఁబూనఁగ నేదియొ కుట్టెనంచుఁ దా
జీర విదిర్చి తొట్రువడి చిందులుద్రొక్కుచు నార్పె దీపమున్.

శ్లో. రోహన్తౌ ప్రథమం మమోరసి తవప్రాప్తౌ వివృద్ధిం స్తనౌ
సల్లాపా స్తవ వాక్యభఙ్గీ మిళనా న్మౌగ్ధ్యం పరం త్యాజితాః
ధాత్రీకణ్ఠ మపాస్య బాహులతికే కణ్ఠేతవాసజ్జితే
నిర్దాక్షిణ్య కరోమి కిన్ను విశిఖాఽప్యేషా న పన్థాస్తవ. ౮౭

అవ:—కొంతకాలము నాయకునిచేఁ బ్రేమింపఁబడి పరిత్యక్తయైన నాయిక దైవికముగఁ దనయింటికివచ్చిన నాయకున కెత్తిపొడుపులతోఁ బూర్వస్మరణము కలిగించుచున్నది. నాయికసామాన్య.

చ. కుదురులనుండి నాదు కుచకోరకయుగ్మము నీదు రొమ్మునం
బొదలఁదొడంగె నీపలుకుపోకడనేనుడికారమందు సొం
పొదవెను గూర్మిదాది యొడినుండియె నీయొడిఁజేరుకొంటి నో
యదయుఁడ! యిట్టినాతెరువునై నను ద్రొక్క నికేమిసేయుదున్.

శ్లో. చక్షుః ప్రీత్యానిషణ్ణేమనసిపరిచయాచ్చిన్త్యమానేఽభ్యుపాయే
యాతే రాగే వివృద్ధిం ప్రసరతి గిరాంవిస్తరే దూతికాయాః
ఆస్తాం దూరే సతావ త్సరభసదయితాలిఙ్గనానన్దలాభ
స్తద్గేహోపాన్తరథ్యాభ్రమణ మపి పరాం నిర్వృతిం సంతనోతి

అవ :—నాయకుఁడనుభవించిన యానందవిశేషమును స్మరించి సహ
చరునితో వేడుకగాఁ జెప్పుచున్నాఁడు. నాయిక పరకీయ.

చ. అరసినప్రీతిచే మనసుహత్తి సమాగమమార్గచింత దె
ప్పరమయి కూర్మిమీరఁదగుభాతి రహస్యపురాయబారముల్
జరుగుచునుండ నప్పొలఁతిసంగమమేటికి? నామె యింటిముం
దఱదరి నేగునప్పటి ముదంబునకు న్వెలఁదీర్పవచ్చునే? 88

శ్లో. కరకిసలయం ధూత్వా ధూత్వా విలమ్బితమేఖలా
క్షిపతి సుమనోమాలాశేషం ప్రదీపశిఖాంప్రతి
స్థగయతి ముహుః పత్యు ర్నేత్రే విహస్యసమాకులా
సురత విరతౌ రమ్యం తన్వీ పునః పున రీక్ష్యతే. రా

అవ :—కవి వాక్యము. నాయిక స్వీయ. మధ్య. నాయకుఁడను
కూలుఁడు.

చ. విడిమొలతో రతింబెనవి వేదనచీరనుదేరఁబోఁబద
మ్ముల మొలనూల్ద్గగుల్కొనినముద్దియ సిగ్గున దీపమార్పఁజే
తుల వెస నూచి పూసరపుఁదున్కలు వైచియు నవ్వి నాథుక
న్నుల నటుగప్పె సందులఁదమంగని యాతఁడు కేరుచుండఁగన్.

శ్లో. పరాచీకోపేన స్ఫుటకపటనిద్రాముకుళితా
ప్రవిశ్యాఙ్గేనాఙ్గం ప్రణయిని పరీరమ్భ చతురే
శనై ర్నీవీబన్ధం స్పృశతి సభయవ్యాకులకరం
విధత్తే సజ్కోచగ్లపిత మవలగ్నం వరతనుః. ౯౦

అవ :—కవి వాక్యము. నాయిక స్వీయ. మధ్య. స్వాధీనపతిక. నాయకుఁడనుకూలుఁడు.

చ. కనలుచు మోముఁద్రిప్పికొని గాత్రముల౯బిగియించి నిద్రపో
యినగతిబల్కకుండెఁదరశేక్షణ నేర్పరియైనభర్త జం
కును వడ కూని నెమ్మదిగఁగోకముడిన్సడలింపఁబూన న
వ్వనితయు రక్తయై బిగువుఁబాపెను దాఁగడు పక్కళించుచున్.

శ్లో. ఆదృష్టి ప్రసరా త్ప్రియస్య పదవీ ముద్వీక్ష్య నిర్విణ్ణయా
విశ్రాన్తేషు పథి ష్వహః పరిణతౌ ధ్వాన్తే సముత్సర్పతి
గత్వైకం నశుచాగృహం ప్రతి పదం పాన్థస్త్రియాఽస్మిన్ క్షణే
మాభూ దాగత ఇత్యమన్ద వళితగ్రీవం పున ర్వీక్షిత౯. ౯౧

అవ :—కవివాక్యము. నాయికస్వీయ. మధ్య. ప్రోషితపతిక. నాయకుఁడనుకూలుఁడు.

చ. తనపతి త్రోవ సంజపడుదాఁక కనుల్ ప్రసరించుమేరకున్
గని విసుగొంది చీకటులు క్రమ్మ వియోగిని నాటి కింటికిం
జనఁదలపూని యొక్కడుగుసాగెనొ లేదొ కనుంగొనెన్ గిఱు
క్కున మెడఁద్రిప్పి రాఁగలఁడొకో యిపుడైననటంచు వెండియున్.

శ్లో. దేశై రన్తరితా శతైశ్చ సరితా ముర్వీభృతాం కాననై
ర్యత్నే నాపి న యాతి లోచనపథం కాన్తేతి జానన్నపి
ఉద్గ్రీవ శ్చరణాగ్ర రుద్ధవసుధః ప్రోన్మృజ్య సాస్రే దృశౌ
తామాశాం పథిక స్తథైవ కి మపిధ్యాయన్ముహుర్వీక్షతే. ౯౨

అవ :—కవివాక్యము.

చ. అడవులు దేశముల్ నదు లహార్యము లడ్డినదూరదేశమం
దెడఁబడియున్నకాంత కనుపింప దిఁకేవిధినం చెటింగియున్
మెడ నిగుడించి వ్రేళ్ళపయి మింటికి సాగి వియోగి బాష్పముల్
దుడుచుచుఁజూచె నద్దెస నెదో తలపోయుచు మాటిమాటికిన్.

శ్లో. స్విన్నం కేన ముఖం? దివాకరకరై, స్తే రాగిణీ లోచనే?
రోషా త్తద్వచనోదితా, ద్విలుళితా నీలాలకా? వాయునా,
భ్రష్టం కుఙ్కుమ? ము త్తరీయకషణా, త్క్లాన్తాసి? గత్యాగతై,
ర్వ్యక్తం తత్సకలం కి మత్రవద హేదూతిక్షతస్యాధరే. ౫౩

అవ :—నాయకునిఁదెచ్చుటకై నాయికచేఁబంపఁబడి సంభోగచిహ్నములతో మరలివచ్చినదూతికకు నాయికకు జరిగిన ప్రశ్నోత్తరరూపసంవాదము. నాయిక స్వీయ. ప్రగల్భ. నాయకుఁడు శఠుఁడు.

ఉ. ఏటికి మోము చెమ్మగిలె? నెండకుఁ, గన్నుల రాగమేల? నీ
మాటల, కేలముంగురులు మార్పడె? గాలికిఁ, బోయెఁగుంకుమం
బేటికిఁ? బైటరాపిడి, నిదే మలవోతివి? రాకపోకలన్
బోటి! యివన్నియున్ సరియె, మోవిపయిన్ క్షత మేల? చెప్పుమా!

శ్లో. కఠినహృదయే ముఞ్చ భ్రాన్తిం వ్యళీకకథాశ్రయాం
పిశునవచనై ర్దుఃఖం నేతుం న యుక్త మముం జనమ్
కి మిద మథవా సత్యం ముగ్ధే త్వయాద్య వినిశ్చితం
యదభిరుచితం తన్మే కృత్వా ప్రియే సుఖ మాస్యతామ్. ౫౪

అవ :—నాయకుఁడు నాయికను బుజ్జగించుచున్నాఁడు. నాయికస్వీయ. మధ్య. నాయకుఁడు శఠుఁడు.

ఉ. కల్లలు వింటచే మదినిగల్గినమోహము మాను దుర్మతీ!
చెల్లదు నీకుఁగొండెములఁజేకొని నాకిటు లార్తిఁగూర్ప నా
వల్లను నేరమున్నదనుభావన నిశ్చయమేని ముద్దియా!
తల్లడమేల? యిచ్చమెయి దండనఁజేసి సుఖింపరాదటే? 94

శ్లో. భ్రూభేదో గుణిత శ్చిరం, నయనయో రభ్యస్త మామీలనం,
రోద్ధుం శిక్షిత మాదరేణహసితం, మౌనేఽభియోగః కృతః,
ధైర్యంకర్తు మపి స్థిరీకృత మిదం చేతః కథంచి న్మయా
బద్ధో మానపరిగ్రహే పరికర, స్సిద్ధి స్తు దైవే స్థితా. ౯౫

అవ:—చెలిప్రోత్సాహమునఁ బొలయల్కకు సిద్ధపడిననాయిక చెలి
తోఁ జెప్పుచున్నది. నాయిక స్వీయ. ముగ్ధ. నాయకుఁడు శఠుఁడు.

చ. బొమముడిపాటునుం, గనులమోడ్చుటయు, న్మృదులస్మితావరో
ధము, నలమౌనభావమును, ధైర్యము, నెమ్మదిఁజిక్కబట్టుటన్
గ్రమమగుపద్ధతిన్, మిగులఁగష్టముమీదటనేర్చి, మానయ
త్నమునకుఁబూనితిం, బిదప దైవముపైగల దెల్లభారమున్.

శ్లో. చరణపతనం, సాస్రాలాపా, మనోహర చాటవః,
కృశతరతనో ర్గాఢాశ్లేషో, హఠా త్పరిచుమ్బనమ్
ఇతి బహుఫలో మానారమ్భ: స్తథాపి చ నోత్సహే
హృదయదయితః కోపం ; కిమత్రకరో మ్యహమ్. ౯౬

అవ:—పొలయల్క పూనుమని బోధించుచెలికి నాయిక చెప్పు
చున్నది.

చ. పదములు పట్టుకొంటయు, సబాష్పముగా బతిమాలుకొంటయున్
జదురగుభాషణంబు, వడిసందులముద్దులు, కౌఁగిలింత లీ
మొదలగుపెక్కులాభములు పొల్చును మానముఁబూన నైన నా
కది రుచియింపదయ్యెఁబ్రియుడాచక నామదిఁగొల్లగొట్టుటన్. 96

శ్లో. కాన్తే తల్ప ముపాగతే విగళితా నీవీ స్వయం తత్క్షణా
త్తద్వాస శ్లథమేఖలాగుణధృతం కించి న్నితమ్బే స్థితం
ఏతావత్సఖి వేద్మి కేవల మహం తస్యాఙ్గసఙ్గే పునః
కోఽసౌ, కాఽస్మి, రతం చ కిం, కథ మితిస్వల్పాఽపిమేనస్మృతిః. ౯౭

అవ:—నాయిక చెలికత్తె నడుగుచున్నది. నాయిక స్వీయ. మధ్య. స్వాధీన పతిక, నాయకుఁడనుకూలుఁడు.

చ. పతి దరిఁజేర నీవి పెడబాసి కటి న్మొలనూలి పట్టుచే
నతుకుకొనెన్ గొరవంత చెఱఁగంతె యెఱుంగుదు వెన్క స్పర్శచే
నతఁడని నేనటంచు రతియంచనియైననొకించుకేని నా
మతిఁదలపోయలేనయితి మానిని దీనికి నేమిహేతువో ? 97

శ్లో. నిశ్వాసా వదనం దహన్తి, హృదయం నిర్మూల మున్మూల్యతే,
నిద్రానైతి, నదృశ్యతే ప్రియముఖం, నక్తం దివం రుద్యతే,
అఙ్గం శోష ముపైతి పాదపతితః ప్రేయాం స్తథోపేక్షిత
స్సఖ్యః కం గుణమాకలయ్య దయితేమానం వయం కారితాః. ౯౮

అవ:—చెలులప్రేరణచేఁ బొలయల్కఁ బూనివచ్చినప్రియునిఁ దిరస్కరించి పిమ్మటఁ బశ్చాత్తాపమునొందిననాయిక యా చెలుల నుపాలంభించుచున్నది.

ఉ. మోము దహించె నూర్పులు సమూలము గుండియ డిందె నిద్ర రా
దాముఖ మోసరిల్లెఁ గృశమయ్యెఁ దనూలత యేడ్పులే సదా
యామెయి నాథునిన్ గసరుటయ్యె నికన్ జెలులార ! మమ్ము మీ
రేమిప్రయోజనంబు గ్రహియించుట మానముఁ బూన్చినారొకో ! 98

శ్లో. నాన్త ప్రవేశ మరుణ, ద్ద్వివిముఖీ న చాసీ,
ద్వాచష్ట రోషపరుషాణి నచాక్షరాణి,
సా కేవలం సరళ పక్ష్మభి రశ్రుపాతైః
కాన్తం విలోకితవతీ జననిర్విశేషమ్. ౯౯

అవ:—అపరాధియగునాయకుఁ డేతెంచినతఱిఁ గుపితయగు నాయిక పొనర్చిన యాకృతిగోపనమును కవివర్ణించుచున్నాఁడు.

ఉ. వంచకుఁడై నవల్లభుఁడువచ్చిన వారణసేయఁబో దుపే
క్షించి మొగంబుఁద్రిప్ప దుడికించెడుపల్కులనై ననాడ లే
దించుకయు న్వికారము వహింపనితిన్ననిచూపులన్ ఖిలో
కించెను లాఁతినింబలె మృగేక్షణ ప్రోఢతనంబుపెంపునన్. 99

శ్లో. ప్రియకృత పటస్తేయక్రీడా విలమ్బన విహ్వలాం
కిమపి కరుణాలాపాం తన్వీ ముదీక్ష్య ససంభ్రమమ్
అపి విగళితే స్కన్ధావారే గతే సురతాహవే
త్రిభువన మహాధన్వీ స్థానే న్యవర్తత మన్మథః. ౧౦౦

అవ:—కవివాక్యము.

మ. రతిసంగ్రామభరంబుదీరఁబరివారంబెల్లఁ జీకాకుగాఁ
బతియుం జీరహరింపఁదత్తరమునం బల్మారు దీనాతిదీ
నత నేమో పలవించునట్టియబలం దాఁజూచి లోకత్రయాం
చితవీరుండగుమారుఁడట్టె మరలించెన్ సేన ధర్మజ్ఞుడై. 100

శ్లో. సాలక్తకేన నవపల్లవ కోమలేన
పాదేన నూపురవతా మదలాలసేన
యస్తాడ్యతే దయితయా ప్రణయాపరాధా
త్సోఽఙ్గీకృతో భగవతా మకరధ్వజేన. ౧౦౧

అవ:—కవివాక్యము.

ఉ. కస్తూరిమితప్పుకై కనలి కోమలి నూపురశింజితంబు లా
క్షారసరంజితంబు మదచంచలమున్ సుమకోమలంబు నౌ
చారుపదంబుచేనొసఁగు సత్కృతి నారఁగఁగొన్నవాఁడెపో
మారునిపేరిదేవునకు మానసమెక్కినబంటు చూడఁగన్. 101

సంపూర్ణము.

# కృతిస్వీకారము.

కృతి గ్రహియించునర్హత యొకింతయులేమి నెఱింగియుండియున్
వితతకళావిశారదుఁడు విజ్ఞుఁడు దారుఁడునైనయట్టి మ
త్పిత గుణబృందవర్ణనము దీకొనుటం దగునంచు నిచ్చగిం
చితి నదసీయకావ్యకులశేఖరమున్ గ్రహియింప నియ్యెడన్.

—శిష్టా వెంకట సుబ్బయ్య.

శతావధాని కాకర్ల కొండలరావుగా రేతత్సమయమునఁ జెప్పిన పద్యములు.

ఉ. న్యాయపథానుయాయి కవినాథకులాప్తుఁడు దానవీరుఁడ
త్యాయతకీర్తి పండితుఁడు హారిగుణాకరుఁ డెఱ్ఱమిల్లి నా
రాయణమూర్తి యాతని యుదారిమఁ జేసి ముహుస్సరస్వతీ
స్ఫాయిత నాట్యరంగమయి భాసిలె నీ నరసాపురం బిటన్.

ఉ. ఆపయి పొన్నపల్యభిజనార్యముఁ డార్యుఁడు వీరరాఘవా
ఖ్యా పరిభాసురుండు నిజహారిచరిత్రమహత్వసర్వతో
వ్యాపితకీర్తిధౌతకకుబంతరుఁ డుత్తముఁ డిట్టివానికిం
బ్రాపయి వన్నెవెట్టి చనినాఁడు మహి న్విడి పిన్ననాటనే.

ఉ. శీలము; సౌహృదంబు, మృదుచిత్తము, సద్గుణశాలి, సంతతో
ద్వేలవదాన్యతాప్రణయి వేంకటసుబ్బకవీంద్రుఁ డెంతయో
కాలమునుండి నాకుఁ జెలికాఁ డతఁ డిప్డు కృతిప్రభుండుగాఁ
గ్రాలునటన్న లోనుబుకు కౌతుకలక్ష్మికి మేరయుండునే ?

చ. తడవులనుండి నాకతఁడు తానొడగూరుచు లగ్గులెంచి యి
వ్వడువున నప్పుదీర్పఁ దగువాఁడను నేనయియుండ వాడు కూర్మి మి
త్రుఁడు కవితాకళాకలనధుర్యుఁడు మల్లవధాని మద్ధురం
బుధిపై సమేధమానసుచిరోన్నతమైత్రికి వన్నెవెట్టుచున్.

చ. అవనిసురాన్వయోద్భవు లుదారచరిత్రవిశిష్టు లంబుజో
ద్భవహితమౌనిపదార్చన విధానవిలోలమనస్కు లిర్వురుం
గవలు పరస్పరమ్ము చెలికాండ్రు రదఃకృతికర్తృభర్తృ లిం
కవసరమేమి యిందుగల యౌచితిని న్వివరింప నియ్యెడన్.

శ్రీ బూరుగుల పూర్ణయ్య శర్మగారే తత్సమయమునఁజెప్పిన పద్యములు:-

ఉ. శ్రీకరుఁ డాశ్రితావనుఁడు చిన్మయతేజుఁడు భక్తపాలుఁడున్
ప్రాకటభాగ్యభోగ్యము లపారశుభాయురభీష్టసంపదల్
మేకొని యిచ్చుచున్నతము మేలొనఁగూర్చుచు వేడ్క పేరిమిన్
సాకుత సత్కృపాభిరతి సత్కృతిభర్తనుఁ గర్త నుద్ధతిన్.

చ. యువకుఁడవీవు పండితుఁడ వొజ్జవునౌటనుఁ గాంచి సద్వరుం
డవనుచు నిన్నుఁగోరె మదినిర్మలబుద్ధినిఁ గావ్యకన్య నీ
ప్రవిమలచిత్తవృత్తిఁ గని ప్రాభవమొప్పఁగ నేలుకొమ్మికన్
భువిని యశోవిహారివయి పూజ్యతనందుచు సుబ్బసత్కవీ!

ఉ. కాసలపాటిభూసురులు గైతనొనర్చెడివారలెక్కడో
వీసము యుండి రుండినవివేకముతోఁ గృతివ్రాయలేదు పో
వ్రాసిననైన నీ గతిని వాసిగ సత్కృతినందలేదు సం
తోసముగర్వమున్ మదికిఁదోచెను నిన్గని మిన్నవన్నిటన్.

ఉ. భూపతులెల్ల మెచ్చుగతిఁ బుష్కలవాక్చతురత్వమేర్పడన్
దాపునఁజేరి సన్నుతులు దద్దయుసల్పుటెకాని యీగతిన్
బాపురే! నీవుగా కితులప్రాభవమొప్పఁ గృతింగనంగలే
దేపున హర్షముప్పతిలి యింపుజనించెను నాకు సత్కవీ!

గీ. సప్తసంతానములలోఁ బ్రశస్తములు గృ
తిగ్రహణముఁ దటాకప్రతిష్ఠయగుట
నందుఁ బ్రథమమ్మీవును ద్వితీయంబుఁ దావ
కీనసహధర్మచారిణి పూనిసల్పి
వంశమంతకుఁ బ్రఖ్యాతి వరలఁజేసి
శోభఁగంటిరె మీరలు సుబ్బసుకవి.

Avanti Press-Rajahmundry. 21-12-46. Q. H. No. E-G. 91 250 Copies; Q. H. No.